# గద్యనాటిక

పుంచలశాస్త్రి ఉపేంద్రశర్మ ఎం. ఎ,

ప్రధానాధ్యాపకులు ప్రాచ్యభాషాశాఖ

ప్రతిష్ఠానము
ప్రాచ్యసారస్వత విజ్ఞానపరిషత్తు
గుంటూరు

అంకితము

భారతభాగ్యవిధాత పూజ్యబాపూజీ

దివ్య స్మృతికి

# విజ్ఞాపనము

తిక్కన జయంత్యుత్సవములను మా కళాశాలలో జరుపుచుండిన సందర్భములందు విరాటాదిపర్వములలోని కొన్నిఘట్టములను నేను నాటకీకరించినవానిని విద్యార్థులు ప్రదర్శించుచుండెడివారు. అలతి యలతి మార్పులతో వ్రాసినట్టి ఆ నాటికలనే గాక కవిబ్రహ్మజీవితమునందలి పరమార్థములను కొన్నిటిని వస్తువుగా గ్రహించినట్టి నాటికను తయారుచేయ కోరిక కలిగినది. ఐతిహాసికులును సాహిత్యపరులును ఆ యుగకర్తనుగూర్చి చెప్పుకొను కథల నాధారముగగొని ఒకింత కల్పనముచేర్చి ఈ వచన నాటికను కూర్చితిని. ఉదాత్తములు ఆదర్శప్రాయములునైన పాత్రలయోగ్యతలను సమర్థతలను మాత్రమే మనసునందుంచుకొని సంభాషణలనుచేయించినాను; కాని తిక్కనాదులనాటి భాష సర్వత్ర వాడుటకు శక్యము కాకపోయినది. ఇట్టినాటికలయందు రంగవిభజనమే ఉచితమనితలచి అట్లుచేసినాను. 1944 వ సంవత్సరమున మాకాలేజీలో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి అధ్యక్షతనుజరిగినతిక్కనజయంతియందు ఈనాటిక ప్రదర్శితమైనది. ఇందలి దోషములను మన్నించి దీనినిపఠింతురుగాక యని సహృదయులవేడుచున్నాను.

ప్రథమముగ ప్రదర్శితమైనప్పటినుండి నేటివరకు ఆంధ్ర మహాజనులకు పరిచయము చేయుటమూలమునను కృతిప్రదాన సభలో ప్రసంగముమూలమునను ఈఅల్పారంభముతో ప్రసక్తిని కలిగియుండి నన్నాదరించిన పురాతత్వకోవిదులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు. గాంధీమహాత్ముల కీ కృతిని సమర్పించుకొనిన నాటి

మహాసభకు అధ్యక్షతవహించిన నా శ్రేయోభిలాషులు దేశభక్త శ్రీ కొండ వెంకటప్పయ్య పంతులుగారిని కృతజ్ఞతతో స్మరించుచున్నాను.

తమకు ఏవిధముగను స్వాస్థ్యము లేని సమయమైనను ఎట్లో తీరికచేసికొని నాటికను పరిశోధించియు, అమూల్యమగు ప్రస్తావనను రచించి యిచ్చియు, నాయెడల చూపిన అభిమానమునకు అభినవ తిక్కన బిరుదాంకితులును సాహిత్య స్థాపకులునగు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతుల నర్పించుకొనుచున్నాను.

ఈ నాటిక ముద్రణమగుచుండు సందర్భమున చూచి కొన్నిసూచనలగావించియు, కోరినంతనే పీఠికను వ్రాసియిచ్చియు నాయెడ నెరపిన సుహృద్భావమునకు మిత్రమహాశయులు, సాహితీసమితి సభాపతులు శ్రీ శివశంకరశాస్త్రి గారికి సంతోషపూర్వక వినతులు.

శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారును, శ్రీ సుబ్రహ్మణ్య శర్మగారును నావచన వాఙ్మయ చరిత్రనుగూర్చి హెచ్చరించి యుండిరి, ఆ రచన మన సర్వకళాపరిషత్పరమున నివేదించుకొన కోరుచున్నానని మనవి.

హిందూకాలేజి
గుంటూరు
25-2-43.

ఉపేంద్రశర్మ.

## పాత్రములు

| | |
|---|---|
| తిక్కన | కథానాయకుడు |
| మనుమసిద్ధి | విక్రమసింహపురి ప్రభువు |
| కొమ్మన | తిక్కన తండ్రి |
| ఖడ్గతిక్కన | తిక్కన సోదరుడు |
| గణపతి దేవుడు | కాకతీయాంధ్రచక్రవర్తి |
| శివదేవయ్య | గణపతిదేవుని మంత్రి |
| కేతన, మారన | తిక్కన శిష్యులు. |

శ్రీ

# తిక్కన

## ప్రథమ రంగము

( కొమ్మన దండనాథుని గృహప్రాంగణము )

(భాస్కర రామాయణముతో కూడిన వ్యాసపీఠమును ముందిడుకొని కొమ్మన ప్రవేశించును)

కొమ్మన

"రామాయ రామభద్రాయ
రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ
సీతాయాః పతయేనమః"

(తాళపత్ర గ్రంథమందలి పుటలు త్రిప్పుచు పఠించును.)

"ఏను జటాయువ దశరథ
భూనాయకు సఖుఁడ రామభూవరునాలిన్
లేనియెడ సీతఁగొంచు ద
శాననుఁ డరుగంగ వాని నాఁగి కడంకన్

ఏపునవాని భర్తృము మ
హీసుతఁ గూర్చి జోడుసించియుం
జాపము దున్మించి వైచి బహు
సాయకముల్ విదళించ్చ వాజుల
న్మాపడఁగించి తద్రథము
నుగ్గుగ మోఁది నఖాళిఁ జంచు వి
క్షేపములన్ గళద్రుధిర
సిక్తశరీరునిఁ జేయఁ జెచ్చరన్.

వ॥ అలుకుగొని యన్నిశాచరుండు.

"విరథుండై సతిడించి బెగ్గలమునన్
వేగంబుతోఁ బాఱఁగా
విరుద్దారన్ వెనువెంటఁ బాఱి కడు ద
ర్పింబొంది రోసుండ భీ
కర ఖడ్గంబునఁ బక్షముల్ దెగిపడం
గా వ్రేసి యాపంక్తి కం
ధరుఁ డుర్వీసుత నెత్తికొంచుఁ జనియెన్
దర్పాతిరేకంబునన్.

వ॥ అని పలుకు జటాయువుం బట్టి కౌగిలించుకొని సౌమిత్రి సమేతుండై రాముండు మహారోదనంబు సేసి యతి దుఃఖంబున.

"రామభూవిభుఁ డప్డు సౌమిత్రి కిట్లను
రాజ్యంబు తొలఁగు టరణ్యవాస
మును దండ్రి చావును జనకజ వోవుట
మొదలుగ శోకాగ్ని మునిఁగియుండ

నాపక్షమునవచ్చి యీపక్షినాథుఁడా
తతేవజ్రి వాగురఁ దగులుపడియెఁ
బున్నమ నుపాంగు పూర్ణాబ్ధి శోషించె
నక్కట నా యభాగ్యంబు కతన

ఘనుడు మజ్జనకు సఖుఁడు ఖగకులేంద్రుఁ
డగు జటాయువు ఱెక్కలు దెగి మహోహ
వోర్వి రక్త సిక్తాంగుఁడై యున్నవాఁడు
పొగులుచును నాదుపుణ్యంబు పొలిసెగాన.

అని పగచి జటాయువుతో
జనకజ నాప్రాణదయిత సద్వ్రత యేది
క్కన కరిగె ననుచు రాముఁడు
ధనువును బాణములు విడచి ధరణిం బడియెన్.

వ॥ పడి యాఖగ పతిచేత సీత వృత్తాంతంబు విస్పష్టంబుగా విని రాముం డనుజసమేతుండై యిరువురు నెలుంగెత్తి వాపోవుచు నేలంబడి పొరలుచు మూర్ఛిల్లి నిశ్చేష్టితులై యుండిరంతఁ గొంత దడవునకు సౌమిత్రి దేఱి యన్నచరణంబు లొత్తుచు నారాము బోధించి యోరామ! దశరథుండు నీగుణంబులం గట్టువడి భవద్వియోగంబు సైరింపజాలక తపోయోగమార్గంబునం బ్రాణంబులు విడిచి నాకగతుండయ్యెనని భరతుండు సెప్ప నీవు చరితనర్మునండవై సీతతోఁ గూడ మరలి పురంబున కేతేర నిన్నుం గన్నులం జూచు జనులతిపుణ్యులు నధిక ధన్యులు నతి సుముఖులునుంగా బురాభిముఖుండవై యరుగు నిన్నుంజూచి కౌసల్య పరమానందంబు నంబొందు.

( తిక్కన ప్రవేశించుచు తండ్రికి నమస్కరించును )

కొమ్మన

తిక్కనా ! కూర్చుండుము. పూజ్యులగు తండ్రిగారి కృతి ; భాస్కర రామాయణము.

తిక్కన

చిత్తము. (కూర్చుండి వినుచుండును)

కొమ్మన

(పఠనమును తిరిగి ప్రారంభించును)

జనకుం డమ్మెయి సంతసింపగ దగన్
సత్యప్రతిజ్ఞుండవై
వనవాస వ్రత శేషమున్ వడపి న
వ్యప్రీతితో డం బురం
బున కేతేరఁగ నిన్ను జూచిన జనుల్
పుణ్యాత్ము లయ్యున్ మఱం
బున నీరాక కు నుత్సహింతు రె వెసను
బ్బున్ తల్లి కౌసల్యయున్.

అతిపుణ్య యదితి త్రిజగ
న్నుత యిందుని గన్న పగిది నోములు పెక్కుల్
వ్రతనిష్ఠ నోమి సుగుణా
న్విత యగు కౌసల్య గనియె నిన్నున రేంద్రా.

కథితాఖిల దానంబులుఁ
బ్రథితాశేష సుకృతములు బహుయజ్ఞములుం
బృథులమతిచేసి యిల దశ
రథ భూపతి నిన్నుబడసె రామమహీశా !

వ॥ అని లక్ష్మణుండు పెక్కుదెఱంగుల బోధింప దెలివొంది రామచంద్రుండు జటాయువుం గనుంగొని.

జనకజ నన్ను నేమనియొ
జానకి రక్కసుఁడెందుఁ గొంచుపో
చనియెఁ గడంకవాని బల
సంపద యెట్టిది యద్దురాత్ముఁ డె
వ్వరి సుతుఁడెట్టివాఁడు తగ
వాఁడెట నుండుఁ దదీయనామమే
మనఁబడుఁ బక్షినాయక స
మస్తము నాకెఱిఁగింపు నావుడున్.

జనవర రావణుండను ని
శాచర వీరుఁడు భూరిశక్తి దు
ర్జనయుత మాయఁ గైకొని ప
రిశ్రమ మొందిన నన్నుఁ జూచి యు
క్కున ఘనపక్షముల్ విఱుగఁ
నఖాగ్రగతిఁ ద్రుంచి మహీజఁ గొంచుఁ జ
య్యన దివి దక్షిణాభిముఖుఁ
డై చనియెన్ బలదర్ప మొప్పగన్.

భూవర సంగ్రామంబున
రావణుఁ బరిమార్చి నీవు రమణీయ జయ
శ్రీ వెలయ సీతఁ బొందుదు
వావిరి నా దీవి కాత్మ వగవకు మంచున్.

(తెరవాత)

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

కొమ్మన

(పుస్తకపఠనమును ముగించును)

శ్రీరామునకు గృధ్రరాజు ఎట్టి ఉపకారము గావించినాడు?

తిక్కన

శకుంతరాజు దశరథుని తోడి తన స్నేహమును సఫలీకృతము చేసికొనినాడు. పితృసఖులు ఎప్పుడు నట్టి హితోపదేశముల జేయుదురు.

కొమ్మన

శ్రీరామచంద్రునికి ఉపదేశకులుగను ఉపకారులుగను ఉండుటకు ఏమి తపము చేసి జనియించిరోగదా కాశ్యపాదులు.

తిక్కన

అట్టి రఘురాముని చరితమును ఆసేతుహిమాచలమును వ్యాపింపచేయుటకును, ఆబాలగోపాలముగ సకల జన

హృదయములను విలసిల్లుటకును కారణభూతులగు కవులును సుకృతులై.

కౌసల్యన

ఔను. ఆదికవి వాల్మీకి లోకమందు రామాయణ కథను ప్రకాశింపజేసినవాఁడు; ఎంతయు వంద్యుఁడుగదా !

తిక్కన

తత్తద్దేశ భాషాకవులును ప్రాచేతసుని గ్రంథమును ముందుంచుకొని తమతమ భక్త్యనుసారముగ పద్యప్రబంధము లుగను ద్విపదకావ్యములుగను రచియించి యుండిరి. తాత పాదులీ మహాగ్రంథమును తెనిగించి ఆంధ్రులకు మహోప కార మొనర్చిరి.

కొమ్మన

తండ్రిగారు రామాయణమును రసవంతముగ తెని గించి మన దేశస్థుల మన్ననల నందిరి. ఈమహాకావ్య మాహా త్మ్యము ఇంతంతయని వర్ణింపతరముగాదు. ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతముల నవలంబించినవారి కందరకును పారా యణయోగ్యము. సకల పురుషార్థ ప్రదాయకమును.

తిక్కన

ఏమి! తాతపాదులు మంత్రి భాస్కరుల కవిత్వ

మహాత్వము. అలతి యలతి మాటలతో పద్యముల కూర్చుట, ఆవేశమును నిగ్రహించుకొని రసమును పోషించుట, ఎల్ల యెడల నౌచిత్యమును పోషించుట అను ఉత్తమ లక్షణములక ఆంధ్ర రామాయణము అటుపట్టుగదా!

కొమ్మన

తిక్కనా! రామాయణము నందలి ఇతివృత్తము సహజముగ రసమయముగను వైదికతత్వ విరాజమానముగను మేటికవి వాల్మీకి మున్ను చేసియుండెను. తరువాత తండ్రి గారు... ...

తిక్కన

తాతగారు మూలమునందలి సొబగులను అనువాదమున నైతము జూపినారు.

కొమ్మన

ఔను. వాల్మీకిలోని రహస్యమును గుర్తించి ఆ రఘురాముని రాజకుమారునిగ చిత్రించిరి. అయ్యు; తమ రామాయణమున సర్వదా రాఘవుని దేవాంశను అంతర్వా హినిగ నుండునట్లు రచించిరి. ఇట్టివి ఉత్కృష్టములును విశేష ములును అగు విషయము లెన్నెని భాస్కర రామాయణమున నున్నవి.

తిక్కన

తాతగారి కావ్యకళా శిల్పాములను గూర్చి తాము...

కొమ్మన

సహృదయుల దృష్టికి గోచరించు నవ్యానిని నీవు పేర్కొనియే యుంటివి. మొత్తముమీద నాయనగారి గ్రంథమున నాగరికతాముద్ర ఎక్కువగా నుండునన్న చాలును.

తిక్కన

తాతగారు వేదాంతపారీణులును, కవితా ప్రవీణులును అగుటయేగాక వ్యవహార ధురీణులగు మహామంత్రులు గదా!

కొమ్మన

పూజ్యులగు తండ్రిగారి ఉత్తమమగు ఆంధ్రకావ్యము మనల కందరకును ఆదర్శము.

తిక్కన

భావనాగమ్యమైన వస్తు సాక్షాత్కారమును గావించి ఆనంద మొసగునది గావున అయ్యది ఆంధ్రకవి ప్రపంచమున కంతటికిని ఆదర్శము. పండితు లందరకును ప్రామాణికము.

కొమ్మన

బాగుగ చెప్పితివి. అందలి వస్తునిర్మాణాదు లట్టివి. కొట్టరువువారి వంశమునందు మంత్రి భాస్కరులు ఉదయించు టచే మనమందరము ధన్యులము.

తిక్కన

చిత్తము, తమతోడి ప్రసంగమున బుద్ధివికాసము కలిగినది. కృతార్థుడను.

కొమ్మన

నేడు సుదినము. ఆహా! తండ్రిగారి కవితారసానుభవమున హృదయమునకు స్పందన విస్తృతి ద్రవీభావములు సిద్ధించినవి. వారిమధురప్రవృత్తిని గూర్చిన ప్రసక్తి లభించినది.

తిక్కన

నాయనగారు! నేను రేపటినుండియు పూజ్యులగు సోదరులవద్ద కొంతకాలము గడుపుచుండుటకు అనుజ్ఞను వేడుచున్నాను.

కొమ్మన

ఔను! అట్లే చేయవచ్చును. కాని సాంగవేదపాఠశాలలోని చదువు విషయము?

తిక్కన

అయ్యది చాలవఱకు పూర్తికావచ్చినదిగనుక ఆవిద్యల తోడ నిప్పటినుండియు కొన్ని లౌకిక విద్యలనుగూడ నేర్వ వలెనని కోరికగలదు.

కొమ్మన

సంతోషము. నీవు పాఠశాలయందలి ఘటికా సాహసుల తరగతికి చెంది యుంటివనియు, ఇక ఒకటి రెండు సంవత్సరములలో సాహిత్యమున ఉత్తీర్ణుడవయ్యెదవనియు మీ గురువులు సెలవిచ్చి యుండిరి.

తిక్కన

మన పట్టణమున నుండిన విద్యాలయము నందలి నావిద్యా వ్యాసంగమునుగూర్చి మాగురుపాదు లట్లు సెల విచ్చినను నేనా పరవిద్యలందు జిజ్ఞాసువునే. మన విద్యలందు ఉత్తీర్ణు లనిపించుకొనుటకు తమ జీవితమంతయు సారస్వత సేవకు ధారవోసిన మాగురువులకే చెల్లినది.

కొమ్మన

యదార్థమె, కాని పారలౌకికము లగు కళలతో మేళవించి లౌకిక విజ్ఞానమును సంపాదించుటయు అత్యా వశ్యకము.

తిక్కన

చిత్తము. అందుకొరకే తమ అనుమతి నర్థించితిని.

కొమ్మన

తిక్కనా ! చౌహత్తనారాయణుని వద్దను రణవిద్య నభ్యసింపుము.

తిక్కన

అయ్యదియె నాకోరిక.

కొమ్మన

ఇక రాజనీతి... ...

తిక్కన

తమవద్దనే నేర్చుకొనెదను.

కొమ్మన

భాస్కరునితో వెళ్లుచు దేవాలయ నిర్మాణ పద్ధతి అందలి శిల్ప చిత్రాదులనుగూర్చి పరిశీలించుచుండుము. ఆత డిప్పుడు అగస్త్యేశ్వరులవారి ఆలయ పునరుద్ధరణభారము వహించి యున్నాడు.

తిక్కన

ఈ అగస్త్యేశ్వరాలయమును తొలుత కట్టించినది ఒక పాండ్యుడట గదా?

కొమ్మన

ఔను పాండ్యుడనియే ప్రసిద్ధి.

తిక్కన

ఆ పాండ్యుడువచ్చి ధర్మకార్యములు ఇచ్చటచేయుటకు కారణము ?

కొమ్మన

ఏమున్నది ? మన గర్తపురి అప్పటికే ప్రాముఖ్యమును కలిగియుండెనన దగియున్నది.

తిక్కన

గుంటూరానాడు పాండ్యుల పాలనమున సుభిక్షముగ నుండ వచ్చును.

కొమ్మన

ఔను. ఆపాండ్యరాజు మహామండలేశ్వరుడని ఆతడగస్త్యేశ్వరాలయమును పరివారపు గుడులు, గోపురములు కట్టించి గడ్డిపూడి చుట్టునున్న పొలమును మాన్యముగా

ఆచంద్రార్కస్థాయిగానిచ్చి యుండెను. అప్పటినుండియు భక్త జనాశ్రయుడైన ఉమాపతి అగస్త్యేశ్వరుడిట వెంచేసియున్నాడు. నాటినుండి మనపుర మెంతయో ప్రశస్తికి వచ్చినది. శాలివాహన శకము తొమ్మిదవ శతాబ్దమున పాండ్యుల బలపరాక్రమాదులు దక్షిణ హిందూస్థానమున క్రమక్రమముగా క్షీణింప దొడగినవి.

తిక్కన

అంతకు పూర్వపు చరిత్ర.

కొమ్మన

అదియును ఉజ్జ్వలమైనదె.

తిక్కన

అయ్యది ఆంధ్రప్రభువులదై యుండును.

కొమ్మన

ఆంధ్రవిష్ణు డవతరించినది మన కృష్ణాతీరమందలి శ్రీకాకుళము. అప్పటినుండియు ఆంధ్రప్రతిభ ప్రపంచపుదృష్టి నాకర్షించినది.

తిక్కన

తరువాత.

కొమ్మన

తరువాతనే గుంటూరు సీమయందు సాటిలేక ఆంధ్రతేజము వర్ధిల్లినది. అమరావతి, ధరణికోట మొదలగునవి అందుకు నిదర్శనములు.

తిక్కన

పలనాటి విషయము?

కొమ్మన

అది మనలను పులకరింప జేయునది. బ్రహ్మనాయని సర్వమత సామరస్యము, సౌమ్యగంభీర స్వభావము, నాయకురాలి అద్భుత ధైర్య ప్రజ్ఞావిశేషము బాలచంద్రుని అఖండ పౌరుషము మన పల్నాటికొక ఉత్తమ స్థానమును తెనుగు దేశచరిత్రములో దక్కగొన్నవి.

తిక్కన

తెలుగుల రాజకీయములనెల్ల గుంటూరుసీమ గుత్తగొని నడిపినట్లున్నది.

కొమ్మన

రాజకీయములే గాదు. మతవిషయమునగూడ గుంటూరు మండలమునకు అనితర సాధారణమైన కీర్తి కలదు. అహింసా ప్రధానమైన బౌద్ధమత మిట వర్ధిల్లినదనుటకు అమరావతి నాగార్జునకొండలె నిదర్శనములు. అటుతరువాత ధర్మ

పునరుద్ధరణము సైత మీగడ్డయందే జరిగినదనుటకు ఈ అగస్త్యేశ్వరాదుల ఆలయములే సాక్ష్యములు.

తిక్కన

ఈజగత్కారణుని ప్రశంసయె నన్నిన్ని విషయములను తమవద్ద నేర్చుకొన జేసినది. ఇంకను కొన్ని సందేహము లున్నవి. మనవి చేయుదునా?

కొమ్మన

కానిమ్ము.

తిక్కన

అగస్త్యేశ్వరాలయము దాక్షిణాత్య దేవాలయముల రీతిననుసరించి కట్టబడి యున్నదా?

కొమ్మన

పాండ్య దేవాలయముల పద్ధతి ఇక్కడి దేవాలయమునందు కానరాదు; కనుక ఆంధ్రశిల్పులు బౌద్ధశిల్పుల ననుకరించి కొంతవరకీ ఆలయముల కట్టియుందురు.

తిక్కన

అమరావతి నాగార్జునకొండల యందవతరించిన బౌద్ధశిల్పుల అమృతహస్తము నేటికిని ఎంతవిస్పష్ట రేఖలతో ప్రత్యక్షమగుచున్నది?

కొమ్మన

బౌద్ధుల శిథిల స్థూపాదు లితర మండలములనున్న వింతశిల్ప చాతుర్యమును చూపవు. వీనినన్నిటిని పరీక్షించుచు ఆంధ్రదేశమును, ఇతర దేశములను నీవు పోయి చూచి వచ్చుటకు ఏర్పాటు చేసెదను.

తిక్కన

నాకట్టి అవకాశము లభించుటకుమున్న పరిసరముల నున్న అమరావతి నాగార్జునకొండలకు మరల వెళ్ళి శోభన శీలురగు బౌద్ధులు ఆంధ్రుల కొరకు ఈదివ్యస్థలముల నాటిన కళాకల్పకముల దర్శించి వచ్చెదను.

కొమ్మన

అవశ్యము అట్లు చేయుము. వివిధవిషయములను తెలిసికొనుటకు, వివిధ ప్రదేశముల తిరిగివచ్చుటకు నీవు సర్వదా యత్నించుచుండుము. ఈవిధముగ సంచరించిన చరిత్రలెన్నియో తెలియగలవు.

తిక్కన

చిత్తము. తమ ముఖతః తెలియదగినదొక మానవంశ కర్తల చరితము ఇంకను మిగిలియే యున్నది.

కొమ్మన

సంతోషము. పరమ ప్రసిద్ధులగువారి చరిత్రలు ఎన్ని పర్యాయములైనను మననయోగ్యములు, ఉత్తేజకరములును.

తిక్కన

వానిని మరల మరల మీవలన వినుట నాకిష్టము.

కొమ్మన

నీప్రపితామహులు కేతనగారు కమ్మనాటికి ప్రభువగు త్రిభువన మల్లదేవ చోడరాజునకు మంత్రిగ నుండిరి. నీపితామహులు భాస్కరులు గొంటూరి ఉదయరాజు మంత్రులు. నీపెదతండ్రిగారు నెల్లూరి తిక్కజననాథశిఖామణికి ఆప్తమంత్రి.

తిక్కన

సకల సద్గుణ శోభితులును సచివాగ్రగణ్యులు నయిన మనపూర్వు లందఱును దేశసేవాపరాయణులు గదా!

కొమ్మన

సందేహమేమి? పరమేశ్వరు డిట్లు మనవంశము వారిని అనుగ్రహించుచుండుట వలననే మనము ప్రజల మన్ననల నందగలుగుచున్నాము. రాజకీయములను, సారస్వతములను చక్కబెట్ట గలుగుచున్నాము.

తిక్కన

తాము గుంటూరు దండనాథులుగను, తాతగారు మంత్రులుగను, మహాకవులుగను నెరపుచున్న, నెరపిన విభుతలు ఉత్తమాదర్శములు, అన్యజన దుర్లభములును.

కొమ్మన

ఉత్తమాదర్శములే; అన్యజన దుర్లభములెట్లు? అగస్త్యేశ్వరుని అనుగ్రహమున నీవంటివారెందరు మనలో మంత్రి భాస్కరుల ననుకరింతురో?

తిక్కన

మహాప్రసాదము. తాతపాదులు తెనిగించినది పూర్వరామాయణము, ఉత్తర రామాయణమును నాశక్త్యనుసారము వ్రాసి ఆకావ్యమును పూర్తిజేయుకుతూహలము ఒకటి కలదు. దానిని తీర్చుకొన నుత్సహించుచున్నాను.

కొమ్మన

మంచి కోరికయే. రామాయణమును ఆంధ్రీకరించుటతోడనే అమాత్యపదవిని ఆ శ్రియఃపతియు, సర్వేశ్వరుడును నగు శ్రీరామచంద్రుడు సిద్ధింపజేయక పోడని తోచుచున్నది. అట్టి పురుషోత్తముని దివ్యచారిత్రంబు సకలాభీష్ట ప్రదంబు. కొన్ని నియమముల నేర్పాటుచేసికొని కళ్యాణకగుణాకరం

జైన, కౌసల్యానందనుని పట్టాభిషేకానంతర కథను వ్రాయుము.

తిక్కన

చిత్తము. ఆత్మ వ్యవస్థార్థము కొన్ని సాహిత్య స్థిర ధర్మముల నేర్పాటు చేసికొనుటకే యత్నించుచుంటిని.

కొమ్మన

మంచిది.

తిక్కన

సెలవు.

(తిక్కన నిష్క్రమించును)

కొమ్మన

మా తండ్రిగారు మొదట రామాయణమును రచించిరి. మహామంత్రులుగ ఆంధ్ర ప్రపంచము నందంతటను విఖ్యాతి నందిరి. మాతిక్కనయు ఉత్తర రామాయణ రచనమునకు నుత్సహించుచున్నాడు. లోకజ్ఞత, శిల్పపారగత కొంతకు కొంత సేకరించినాడు. ఇంతలో నొక శుభవర్తమానము. నెల్లూరినుండి దిట్టకవివారు తిక్కనకు తమకన్య నిచ్చెదమని. విక్రమపురి వాస్తవ్యులతో వియ్యమందుట భావి శుభసూచకముగ గన్పట్టుచున్నది. మా అన్న సిద్ధన నాటినుండియునున్న ప్రాతచుట్టరికము వదలుకొనగూడదు. ఇయ్యది మాకుల దేవత నల్లశాణాంబ వాంఛితమువలె గన్పట్టుచున్నది.

(కొమ్మన నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

# ద్వితీయ రంగము

(మనుమసిద్ధి సభా భవనము

మనుమసిద్ధి, తిక్కన, ఖడ్గతిక్కన, కేతన, మారన ప్రవేశింతురు.)

మనుమసిద్ధి

మామా! ప్రశాంతపరిస్థితులు ఏర్పడినవి. ప్రజలు ఇంకను సుఖవంతులుగ నుండుటకు గావింపబడు మన యత్నములు ఫలప్రదములా?

తిక్కన

ఔను; అన్నియు ఫలప్రదములు. భగవదనుగ్రహమున సాధింపబడని సత్కార్యము లుండవు. రాజా! నీ పరిపాలనము సుభిక్షముగ నున్నది.

మనుమసిద్ధి

మామా! సుభిక్షముగనుండ కెట్లుండును. పరమేశ్వరుడు మా తండ్రినాటి నుండియు కొట్టరువువారి కూర్మిని మాకు ప్రసాదించి మేలు కావించియున్నాడు.

తిక్కన

సిద్ధిరాజులు గొప్ప కార్యశూరులేగాక మంచి మాట

నేర్పరులుకూడ. ప్రభు మంత్రులు పరస్పరము ఇట్టి గౌరవా దర భావములు కలిగి మెలగిరి, కనుకనే మనపూర్వు లంతటి ఘనకార్యము లొనర్పగలిగిరి.

ఖడ్గతిక్కన

పూర్వుల చరితల వలన మన ముత్తేజితుల మగుదుము నాటి పరాక్రమశీలుర ప్రవర్తనములె నేటికిని మనకు ఆదర్శ ములు.

కేతన

మనము వానిని మహాకవుల వాక్కుననే వినవలయును.

మారన

మాగురుదేవుల సమక్షమున నేడీ ప్రసంగము వచ్చుట వలన మనము ధన్యులము.

మనుమసిద్ధి

మామా! నా కుతూహల మధిక మగుచున్నది.

తిక్కన

ఎంతని ఈ తెలుగుచోడుల చరితలు చెప్పగలను? వీరు మండలేశ్వరులని ప్రసిద్ధిగాంచి విక్రమసింహపురి మొదలు కొని కాంచీపురి వరకుగల దేశమును పాలించిరి, వీరు కొంత

కాలము కాకతీయాంధ్ర చక్రవర్తులకును మరికొంతకాలము చాళుక్యచోళ చక్రవర్తులకును సామంతులై విలసిల్లిరి. వీరి గాథలు మహోజ్జ్వలములు అతి విస్తరములును.

ఖడ్గతిక్కన

తిక్కనా! నీవు వీని నన్నిటిని గ్రంథస్థము చేయవలె.

కేతన

తెలుగుచోడుల చరితల కంతటితో శాశ్వతత్వము లభింపగలదు.

మనుమసిద్ధి

ఖడ్గతిక్కన వాక్కు తథ్యము. నేను నిన్ను మామా యని పిలుచుటకు తగినట్లు నీకావ్యకన్యకను ఒసంగి నాపిలుపును సార్థకపరుపుము.

తిక్కన

సంతోషము. రాజా! నీ సౌందర్యసంపదకును, నీమైత్రీ విశేషమునకు హర్షించి నాకృతికి నిన్ను పతినిగావింప గోరుచున్నాను. కాని...

మనుమసిద్ధి

మామా! ధన్యుడను. కాని యనుచుంటి వేల ?

తిక్కన

రాజకీయ మతసారస్వత పరిస్థితుల చక్కబెట్టిన తరువాతగాని కావ్యరచన కొనసాగింప జాలనని.

మనుమసిద్ధి

మామా ! చోళచాళుక్యుల కలహమున చోళులకు సాయము చేసితివి. వారి మైత్రి మనకు చేకూర్చితివి.

తిక్కన

రాజా వారిమైత్రిని చేకూర్చుటగాదు. నీపాలనమున దానిని పునరుద్ధరించుట జరిగినది. ఏలన నీతండ్రి చోళస్థాపనాచార్యుడను బిరుదు వహించినవాడు.

మనుమసిద్ధి

సరి, నాచే పితాచారము పాటింపజేసితివి. రాజకీయముగ ఆందోళనముల నడుగంట చేసినావు. ఇక సారస్వత, మత పరిస్థితు లున్నవి.

కేతన

గురువులు శివకవులను భవికవులను ఒకరి నొకరు ద్వేషించుకొనకుండ వాఙ్మయమునే సాధర్మ్యముగా గ్రహించి సారస్వత సేవ జేయునట్లు వారిని కోరినారు, వారంగీకరించిరి.

మనుమసిద్ధి

మామా! ఉభయ కవిమిత్రులై నెగడినారు.

కేతన

రాజా! గురువులు తమ రచనల మూలమున నేటి భిన్న భిన్న పక్షములకు చెందిన దేశి, మార్గ కవులకు మార్గదర్శకులై కూడ సాహిత్యమున సామరస్యము సాధించిరి.

మారన

మత వైషమ్యములను మటుమాయ మొనర్చినారు.

మనుమసిద్ధి

ఎట్లు? ఆ సమన్వయ మార్గమును వివరింపుము.

మారన

వీరశైవమును వీరవైష్ణవమును ఆశ్రయించుచు ఉద్రిక్తులై, జనము సంచరించుటచే నీవైషమ్యము లేర్పడుచున్నవి. ప్రశాంత పరిస్థితు లేర్పడవలెనన్న ప్రజలు హరిహరోపాసకులు గావలెనని గురువులు బోధించిరి.

మనుమసిద్ధి

ఔను, మామా! మంచిమార్గ ముపదేశించితిరి.

మారన

ప్రధాన దేవతలై ప్రజలచే పూజింపబడు శివుడును విష్ణువును ఒకే బ్రహ్మయొక్క పరిణామరూపములే యని బోధించిరి. మామా! సర్వమును బ్రహ్మయేయను మహోదార మతమునకు జేరిన మనలో ఇన్ని భేదములు నశింపవలెను.

తిక్కన

రాజా! అవశ్యమది జరుగవలెనననిన అద్వైత మతప్రచారము జరుగవలెను. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే" అను సూక్తియందలి పరమార్థమును పామరులు గ్రహింపవలెను. అందుకుగాను శివునిమూర్తిని విష్ణునిమూర్తిని ఒకేమూర్తియగు హరిహరనాధునిమూర్తియందు జేర్చి దేవాలయములను నిర్మింపవలెను. ఈ రెండు మహత్తర మూర్తులను తనయందు ఏకీకరించుకొనగల భద్రాయితమూర్తి హరిహర స్వామి యొక్కడే.

మనుమసిద్ధి

మామా! మన ముఖ్యపట్టణమగు నీవిక్రమసింహపురిని, ఈపావన పినాకినీతీరమున నొకహరిహరనాధాలయమును కట్టించుటకు ఆయత్తమొనర్చెదు.

తిక్కన

సరి, మనమేపద్ధతిని అనుసరించి దేవాలయనిర్మాణము చేయించుటయో నిర్ధారణము కావలెను. తరువాత శంకుస్థాప

సముహూర్తముంచి పని ప్రారంభింప జేయవచ్చు. దక్షిణాయనము ప్రతిష్ఠలకు తగినసమయముకాదు. అందును శ్రావణమాసము శ్రేష్ఠముకాదు.

మనుమసిద్ధి

మామా! మాపూర్వులు కట్టించినట్లుగ మనమును.

తిక్కన

మంచిది! తెలుగుచోళులు కట్టించిన దేవాలయములు పాదమునుండి శిఖరమువరకు లోనగుల్లగా కట్టుకొనిపోయిరి. కాకతీయశిల్పము, గాంగశిల్పము, దాక్షిణాత్యశిల్పము వీనిని గూడ మన దేవాలయమునందు రూపింపజేయనగును.

మనుమసిద్ధి

మామా! మనము మొదటిపర్యాయముగ హరిహరనాథులను ప్రతిష్ఠజేయ పూనినాము. శిల్పరచనమందును విజ్ఞానముతో కూడిన నూతనపద్ధతుల ననుకరింపదగును.

తిక్కన

రాజా! నీఉత్సాహ ప్రోత్సాహముల ననుసరించియె ఆలయము శిల్పకళాప్రాభవమును కొంచెము మిగులును. కాకతీయుల శిల్పప్రౌఢి ఓరుగల్లునందు ప్రదర్శిత మైనది. శ్రీ నటరాజేశ్వరుని నాట్యానుహాసంపదమును శిల్పచిత్రముల జూపినారు.

మనుమసిద్ధి

మనకును నటేశ్వరుల శిల్ప మావశ్యకము గదా! అది అక్కడివారిచేతనే గావింపబడవలెను. మన దేవాలయములమీది శిల్పములద్వారాకూడ నూతనమగు మన హరి హరాద్వైత మతమును ప్రజలలో ప్రచారము చేయుటకు ప్రయత్నము జరుగవలెను.

తిక్కన

తప్పక అట్లు చేసెదము. మన పూర్వులును మత ధర్మముల ప్రజలలో వ్యాపింప జేయుటకు దేవాలయములమీది శిల్పాకృతుల నుపయోగించుకొనిరి. కాని, రాజా! ముందుగజరుగవలసిన పనులను, ప్రారంభింప జేసెదము. శ్రీగారి విగ్రహమును గాంగ శిల్పులచే చెక్కింతము. వారి శిల్ప లాలిత్య మత్యద్భుతము. విశేషించి వారు స్త్రీరూప రచనమున సిద్ధహస్తులు. స్వామివారి రథము తయారుచేయుటకు పల్లవ శిల్పులను పిలిపింతము.

ఖడ్గతిక్కన

ఈ ప్రశాంతసమయముల జేయదగిన మహాకార్యములను తలపెట్టి ప్రభువువారు, ప్రధానులు పూజనీయులైరి.

మారన

దేవాలయ నిర్మాణము; సప్త సంతానములలో నిది

ప్రశస్తము. మనుమసిద్ధిమహీశు లిందుకు పూనుట ఒప్పియున్నది.

కేతన

ప్రశస్తతర మనబరగు కృతి ప్రదానమునకు ఈవరకే నిశ్చయము జరుగుట ప్రశాస్యము.

మనుమసిద్ధి

కేతనా! కృతి ప్రదానము ముందు జరుగవలసినది.

కేతన

చిత్తము. గురువులు గ్రంథ రచనారంభమునకు మున్ను కొన్ని ప్రతిజ్ఞలు చేసినారు. వానిని చెల్లించుకొనుచు వ్రాయుట కొంత ఆలస్యమునకు కారణమైనది.

మనుమసిద్ధి

రాజకీయ, సారస్వత, మత క్లిష్టపరిస్థితుల మూలముననుకొంత గ్రంథ రచనోద్యోగమునకు భంగము కలిగినది కనుక ఇక నిరాటంకముగ వ్రాయువచ్చును గదా! మామా! ఏమి సెలవిచ్చుచుంటిరి.

తిక్కన

కృతిభర్త శంభుత్వాపాదులు గ్రంథమున కెక్క

టకు అవకాశము, సాహిత్య మర్యాదల నన్నిటిని పాటించు టకు వీలు చిక్కినది.

కేతన

గురువు లేర్పరచిన నియమముల నన్నిటిని పాటించిన కవిత్వ మింతవరకును రాలేదు.

మనుమసిద్ధి

అటులనా! మామా! తమ నిర్ణయములు రాజకీయ ములందు వలెనే వాఙ్మయరంగము నందును అవశ్యాచర ణీయములును, ఔచితీ సంపన్నములు నగును. సెలవీయప్రార్థన.

తిక్కన

పలుకులపొందు జూచుట, ప్రాతవడిన మాటలను పరి హరించుట, యతిప్రాసములందుసైత మర్థమునకు తగియుం డెడి మాటలనే స్వీకరించుట, జాత్యము భంగముగునటుల సం స్కృతమును ప్రవేశపెట్టకుండుట, అలతి యలతి పదముల మనోహరములైన పద్యముల రచించుట, రసమును ప్రకటము చేయునట్టియు ఇంపునింపునట్టియు పలుకులను కూర్చుటఅనునవి.

మనుమసిద్ధి

మామా! ఈ తమ మహోపదేశములు మహోప కారకములు.

తిక్కన

ఆత్మవ్యవస్థార్థము కావించుకొనిన నియమములివి.

కేతన

అయినను క్లిష్టార్థ కల్పనైక శరణములయిన శబ్దాలంకారముల కొరకు యత్నింపరాదను మహోపదేశము తమనియమముల మూలమున గావించినారు.

మారన

రసభావాదులను విడనాడనివియు చిన్నచిన్నవియు మధురములునగు తెలుగుపదములును, చక్కని లోకోక్తులును శ్రోతలను పఠితలను ఆనందపరచునను సందేశమున్నది. గురువులు సమకాలికులమగు మాకును భావి కవికుమారులకును చక్కనిమార్గ ముపదేశించినారు.

కేతన

మనుమసిద్ధిపతీ! గురువులు మహాకవులెగాక అగ్రశ్రేణికి చెందిన విమర్శకులు నగుటకు నిదర్శన మిట్టి వ్యావృత్తి నియమముల గైకొనుటయె.

మనుమసిద్ధి

కేతనా! గ్రంథస్థ వస్తువునుగూర్చికూడ చెప్పి శ్రవణానందము గావింపుము.

కేతన

సకల వేదాంత రహస్య ప్రతిపాదకంబును, ఐహికాముష్మిక సుఖప్రదంబును, ప్రఖ్యాతంబును నైనది. ధీరోదాత్తులు రఘురాముల చరితము. నిర్వచనోత్తర రామాయణమని గ్రంథనామము.

మారన

కథావైభవమునుబట్టి గురువు లిద్దానిని రచింపబూనిరి.

మనుమసిద్ధి

మారనా! బాగుగ చెప్పితివి. ఈచరితమువలెనె లోకవిదితంబైనది భారతంబు ఒండు గాన్పించుచున్నది.

కేతన

రాజా! ఆ ఆంధ్ర మహాభారతము సైతము దివ్యకవితావిభాసితులగు తిక్కనామాత్యుల చేతనే పూరింపబడు భాగ్యము తెనుగువారికి పట్టునేమొ!

మనుమసిద్ధి

అప్పుడు మనము ధన్యులమె అగుదుము. ఈ కృతి ప్రదానము ఈ ప్రశాంత దినములలో...

ఖడ్గతిక్కన

మహావైభవోపేతముగా జరుగవలసినది.

మనుమసిద్ధి

నా ఆశయ మట్టిది.

కేతన

ఈ కృతి ప్రదానము అపూర్వమును కాగలదు.

మారన

ధన కనక వస్తు వాహనాదులచే పూర్వపు రాజుల కవి పూజా సమ్మాన మహోత్సవముల గావించిరి. వారి గ్రంథముల నంకిత మొందిరి.

కేతన

గుణ సముచ్చయాభిమానమునను, సౌందర్యాభిలాష చేతను ఒసంగబడునది మా గురువులకృతి.

మారన

గురువుల కృతికన్యకయు సరసగుణ సమేతయై మహా రాజు హృదయము నలరింపగలదు.

మనుమసిద్ధి

కృతార్థుడను. పుట్టుకచే భిన్నవర్ణులమయ్యు- వావివరుసలను, బాంధవ్యమును కలుపుకొనిన మా స్నేహమున కిది శాశ్వతమైన చిహ్నము.

తిక్కన

సంతోషము.

ఖడ్గతిక్కన

రాజా! మాతండ్రిగారు సిద్ధనామాత్యులతో ప్రారంభమై మాతిక్క సచివునినాడు ప్రబలమై నేడు ఈవిధముగ పరిణతి నందిన మన ఉభయవంశముల మైత్రి దిన దిన ప్రవర్ధమాన మగుగాక!

మనుమసిద్ధి

సిద్ధనామాత్యనందనా! ఇంతకంటె నాకు కావలసినది లేదు.

(అందరు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

---

# తృతీయ రంగము

( మనుమసిద్ధి సభామందిరము

మనుమసిద్ధి తిక్కన ప్రవేశింతురు )

మనుమసిద్ధి

మామా ! ఎంతటిమార్పు కాటమరాజునకు పశుగ్రాసము నిప్పించినందుకుగదా ! ఈప్రతీకారము. ఔరా !

తిక్కన

రాజా! ఆశ్చర్యముగనే ఉండును. ఏమిచేయుట? ఆయా పరిస్థితులకు తగినట్లు ప్రవర్తించుటకు ప్రయత్నించుచుందుము.

మనుమసిద్ధి

మామా ! నేటికి రెండువారము లైనది. కాటమరాజు సేనలను గదియబోయిన మన ఖడ్గతిక్కన జాడ తెలియరాదు, కారణము?

తిక్కన

జయలక్ష్మినిగొని మన సేనల నింటికి నడిపించుకొని వచ్చుట కొంత ఆలస్యమగును.

మనుమసిద్ధి

ఏమీ ! (ఆలోచన నభినయించును)

తిక్కన

రాజా ! ఏమియో శంకించుచుంటివి ?

మనుమసిద్ధి

(ముక్కుపైని వేలుంచుకొని నిట్టూర్పు విడుచును) కనిగిరి సీమపాలకునకు ... ...

తిక్కన

ఔను. ఆతని అల్పత్వము మన రాయబారియగు అన్నమభట్టును అవమానించినపుడే తెలిసినదిగదా !

మనుమసిద్ధి

ఇప్పుడు యుద్ధమున ...

తిక్కన

ధర్మయుద్ధము జరుగదనియా ?

మనుమసిద్ధి

ఔను. ఆకాటమరాజు కడు మాయావి. దుష్టుడు.

తిక్కన

కానిమ్ము.

మనుమసిద్ధి

మన సేనలు ఏమైయుండునో అని నా యోచన.

తిక్కన

విజయలక్ష్మీధీశ్వరుని, రక్కసగంగని, మహారాష్ట్ర సామంతుడైన సారంగుని జయించిన ధీరుడవు నీవు...
జయాపజయంబులు దైవాధీనములు...

(ఖడ్గతిక్కన ప్రవేశించును)

మనుమసిద్ధి

వీరతిక్కన విజయలక్ష్మీసహితులై వచ్చినట్లు లేదు.

ఖడ్గతిక్కన

ఇప్పటికి తాము సెలవిచ్చినట్లే.

తిక్కన

ఔరా!

మనుమసిద్ధి

ఏమీ! ఎంతపని జరిగినది?

ఖడ్గతిక్కన

పంచలింగాల కొండకడ మనసైన్యములు శత్రుసైన్యములతో తలపడినవి.

మనుమసిద్ధి

ఎదిరి సైన్యములు మనకన్న సంఖ్యలో మిన్నలు కాబోలును.

ఖడ్గతిక్కన

చిత్తము.

తిక్కన

వారి సైన్యమందలి యోధులు?

ఖడ్గతిక్కన

వారి సైన్యమందలి యోధులందరును యాదవవీరులు. పల్నాటి ప్రభువయిన పద్మనాయకుడు, పల్లికొండ ప్రభువయిన చల్లపిన్నమనాయకుడు, దోనకొండ అయితమరాజు, కరియావుల రాజు, వల్లభన్న, ముమ్మయ్యనాయుడు, పుత్తమరాజు మొదలగువారు.

మనుమసిద్ధి

వారిలో నాయకులై శత్రుసైన్యముల నడపిన దెవరు ?

ఖడ్గతిక్కన

పిన్నమనాయని మంత్రియు; ఆరాధ్య బ్రాహ్మణుడు బ్రహ్మరుద్రయ్యయును.

మనుమసిద్ధి

యుద్ధము ఎట్లు నడచినది?

ఖడ్గతిక్కన

(వీరోత్సాహముతో) రాజా! కోడికూత వేళ రణభేరి మ్రోయించి "హరమహాదేవ" అను అట్టహాసములతో ఒక ముహూర్తములో మనశూరులు శత్రుసైన్యముపైబడి నురుమాడ మొదలిడిరి. ప్రొద్దెక్కుకొలది పోరు భీకరతరమాయెను. మన లక్షసైన్యము అరిభీకరముగ పోరిరి ప్రభూ!

మనుమసిద్ధి

భేష్.

తిక్కన

వీరవిహారము సల్పిన మనుమసిద్ధి వాహినులకు విజయమేల చేకూరలేదో?

ఖడ్గతిక్కన

రాజా! మన సేనానుల త్యాగములు స్మరించుకొనదగినవి.

మనుమసిద్ధి

అవశ్యము.

ఖడ్గతిక్కన

అపరాహ్ణామయినను విజయలక్ష్మి ఎవరికిని వశము గాలేదు. ఒక్క త్రుటిలో మన తిరునామాల తిప్పరాజు శత్రు సైన్యములను ఉభయపార్శ్వములనుండి ఎదుర్కొనెను. పెక్కుమంది దళపతులను దునుమాడి తానును హతుడయ్యెను.

మనుమసిద్ధి

అయ్యో! మన తిప్పరాజు కూలెనా!

ఖడ్గతిక్కన

ఎచటచూచినను పీనుగుల పెంటలు, వరదలై పారు రక్త ప్రవాహములు. ఇట్టి వికట భీకర దృశ్యములతో భీష ణారావములతో నొక్కపెట్టున యుద్ధరంగ మంతయు కల్లోల మయినది. కాని సాయం సమయమునకు కాటమరాజు స్కంధా వారమునందు విజయసూచకమైన కోలాహలము విన నయి నది. నేను తిరిగి కాటమరాజు సేనలతో పాలేటి యొద్దన పోరి పగర నుక్క డగించెదను.

మనుమసిద్ధి

అప్రతిమాన పరాక్రమోపేతుడవు నీవు పునః ప్రయ త్నమునకై వెళ్లుటయా?

ఖడ్గతిక్కన

రాజా ! ఎవ్వ రేమనుకొన్నను నే నిక్కడకు వచ్చినది తమ అనుమతిని మరల కొంత దండును తీసికొని వెళ్లుటకె.

మనుమసిద్ధి

మామా ! మరల శత్రుసైన్యము నెదుర్చుటకు వెళ్లుట కంటె మిన్నకుండుటయె మే లేమో?

తిక్కన

రాజా మరల మన సేనలు యుద్ధమునకు సిద్ధమై పోవుట వలన మన కవమానము ఆవంతయు లేదని నా యభిప్రాయము.

మనుమసిద్ధి

మొన్న నేగదా వేలకొలది యువకులను జేర్చి మన సైన్యముల వృద్ధి జేసినాము. కాని గట్టిన తెనుగు బిడ్డ లందరు కదనరంగమున తెగినవారే అయిరి. కనుక కల్లోలము కలుగకుండ నుండవలెను.

తిక్కన

రాజా ! ద్విగుణీకృత మగు ఔద్ధత్యముతోడ దండు వెడలి మనుమభూమీశుడు కాటమరాజున కోడిపోలే దనియు,

ఆత డరిభయంకరు డనియు నిరూపించుటయే నీధర్మము. శత్రు ధ్వజములకు మన భూములలో తా వీయరాదు.

ఖడ్గతిక్కన

వీరాధివీరుడు తెలుగుచోడుడు చిన్ని కనిగిరి రాజున నను కళంకము పొందరానిది.

మనుమసిద్ధి

అగును! కర్తవ్య మేమి ?

ఖడ్గతిక్కన

ఆంధ్ర మహీజాని విజయలక్ష్మిని పొందె నను కీర్తిని నందుటయే కర్తవ్యము. రాజధర్మమును విస్మరింపకుము. వివే లగు మన ప్రజలలో కలవర మేర్పడు ననుకొనుట భ్రమ.

తిక్కన

మన సేనాని వాక్యములు సత్యములు. రాజా! సందేహిం పకుము.

ఖడ్గతిక్కన

తమ సర్వస్వమ్ముల నొడ్డి, విజయదీక్షను గైకొని, కత్తు లను జేబూని, వీరావేశముతో తాండవించుచు యుద్ధమునకు తెనుగుయోధులు సిద్ధ మయ్యెదరు. విక్రమసింహపురివారు

పూనికను విడనాడి చేవమాలి యున్నారను నడి సహింప రానిది. వీరరక్తము కాగి పొంగులు వారుచున్న విక్రమసింహ పురి కోటకు కళంకము. ఖడ్గతిక్కన కుఠారమునకు తిరుగు లేదు. శత్రుదుర్నిరీక్ష్యుడీ తెనుగుబంటు. ఈతనికంఠమున ప్రాణము న్నంత వరకు తెనుగురాజునకు పరాజయముండదు.

మనుమసిద్ధి

మామా! ఉపదేశింపుడు.

తిక్కన

ఖడ్గతిక్కన సామాన్యుడు కాడు. పగఱకు వెన్నిచ్చి వచ్చు పంద కాడు. కాటమరాజేడ ఖడ్గతిక్కన యేడ? తెనుగు చోడుని సేనాధ్యక్షునకును కనిగిరి పాలకునకును ఎంతయో అంతర మున్నది.

తిక్కన

రాజా! మనకీ పర్యాయము జయసిద్ధి తప్పదు.

మనుమసిద్ధి

పూజ్యుల వాక్యములు వృధ గావు.

ఖడ్గతిక్కన

సెలవు!

(ఖడ్గతిక్కన నిష్క్రమించును)

మనుమసిద్ధి

మామా! పశులపుల్లరిని గూర్చిగదా ఇంతటి ఘోర సంగ్రామము, ఇంతటి జనక్షయమును!

తిక్కన

ఔను. రాజా! సామంతుల యౌద్ధత్యము సహింప రానిది.

మనుమసిద్ధి

మన సేనాధ్యక్షునకు తోడుగా ఈపర్యాయము జనిన ఇతరయోధు లెవరు?

తిక్కన

శ్రీకంఠరాజు, పెదవేగి చొక్కరాజు, పెదవరదరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగరాజు, చెన్నపట్టణము చంద్రశేఖరుడు, పట్టకోట బసవరాజ ప్రముఖులు.

మనుమసిద్ధి

మామా! వీరితోపాటు వీరస్వర్గ మలంకరించిన వారిలో మన తిప్పరాజుకూడ గలడు. ఎందరు దేశభక్తులు తమ ప్రాణములు సమర్పించిరి!

తిక్కన

వీ రందరకు మాన్యముల నిత్తుము; వీరు వానిని వంశ పారంపర్యము అనుభవింపగలరు.

మనుమసిద్ధి

ఇందరు రాజభక్తు లుండుటవలననే మనము యుద్ధములను తలపెట్టుట జరిగినది. ఇంకను ఎందరు యోధులు ఆహుతి కావలెనో!

తిక్కన

అయ్యది మనము నిశ్చయింపజాలము. సర్వము హరిహరాధీనము.

మనుమసిద్ధి

మామా! రెండవపర్యాయము ఖడ్గతిక్కనకు తోడ్పడ నేగిన వీరు లెవరు?

తిక్కన

కాళహస్తి పాపతిమ్మరాజు, వెలకంచి వెంగళపతిరాజు, ప్రభుగిరి పట్టణముమ పద్మశేఖరుడు మున్నగువారు.

మనుమసిద్ధి

ప్రశాంతస్థితులు, కృతి ప్రదానోత్సవము, ఆలయ ప్రతిష్ఠ మొదలగు మహోత్సవములతో కూడిన సంతోష దిన.

ములు ఎంత త్వరలో గడచిపోయినవి ! మారణ హోమాదు లారంభించినవి. దుర్భర హింసకు ప్రజలు పాల్పడవలసి వచ్చినది.

తిక్కన

రాజా! నీవిట్లు భావింపరాదు. నీ ధర్మమును నీవు నిర్వర్తింపనిచో (శ్రేయ స్సెట్లు చేకూరును? రాజు లందరును మనుమార్గగాములు అగు టెట్లు ?

మనుమసిద్ధి

ధర్మమునకు కరుణతో పని లేదు గదా!

తిక్కన

రాజు కరుణాసముద్రుడు; ప్రజల బిడ్డలవలె బ్రోచువాడు, ధర్మమూర్తి. శరణన్న శత్రువును రక్షించుట కరుణ కాదా?

మనుమసిద్ధి

అప్పుడును దయ చూపకుండుట, వేసిన అగ్నిని వృధ పుచ్చుట వంటిది.

తిక్కన

ఇట్టి ఉదారగుణగరిష్ఠు డగు రాజునకు పరమేశ్వరు డెప్పుడును పరాజయమును కలుగనీయడు, ప్రజా నష్టము కలుగజేయడు.

మనుమసిద్ధి

అక్కన బయ్యనల వలన కలుగు బాధలనుకూడ అంత మొందించిన గాని ఇతోధికముగ మన పరిపాలనము ప్రజల మెప్పు నందదు.

తిక్కన

అందుకు తగిన సన్నాహములలోనే మన యువకు లందరు నున్నారు. యుద్ధ శిక్షణ శిబిరములు నిరంతరము పని చేయు చున్నవి. ఆ సైనిక నివహము నుండియే కొన్ని వాహి నులు కాటమరాజుతోడి యుద్ధమునకు పోయినవి.

మనుమసిద్ధి

నేను తక్కిన వాహినులను తీసికొని పోయి అక్కన బయ్యనల ఆగడమును అణచెదను.

తిక్కన

రాజా! నీ దాయాదులతోడి పోరునుగూర్చి సావధాన ముగ యోచింపుము. అది అంత సులభము కాదు. కాటమ రాజుతో యుద్ధము జరుగుచుండగ మనము జాగ్రత్తతో నగర రక్షణము చేయింపవలెను గదా!

మనుమసిద్ధి

ఔను. మన మిప్పు డేమి చేయుదము ?

తిక్కన

పరబలముల సాయము నపేక్షింతము. ఈసమయమున

శ్రీమత్కాకతీయాంధ్రచక్రవర్తుల సాహాయ్యము కోరుట శ్రేష్ఠము.

మనుమసిద్ధి

రాజధానియందు నేను వలసినంతకాల ముండి తరువాత ధైర్య స్థైర్య విక్రమోపేతు లగు మన యోధులలో నొకరిద్దరకు ఆ కార్యభారము అప్పగించెదను. నీ వీ రాయబారమును నిర్వహించి గణపతి చక్రవర్తి సేనల తోడ్పాటును కొనిరమ్ము.

తిక్కన

సరి.

(తిక్కన లేచి నిలుచును)

మనుమసిద్ధి

మామా! మీరు సిద్ధమగుట తోడనే ప్రయాణభేరి వేయించెదను.

(తిక్కన నిష్క్రమించును.)

(ప్రకాశముగా) ఆహా! అమాత్యుడును దండనాథుడును నై అహోనిశలు ఆంధ్రచోడుల సామ్రాజ్యాభివృద్ధికి పాటుపడు నీ తిక్కన ధన్యుడు. ఈయన ప్రభుభక్తి నిస్తులము. దేశాభిమానము ఆదర్శప్రాయము. నేను పోయి అక్కన బయ్యనల తోడి ఆహవమునకు సిద్ధపడెదను.

(మనుమసిద్ధి నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

# చతుర్థ రంగము.

( ఓరుగల్లులోని గణపతిదేవుని సభాభవనము

శివదేవయ్య, తిక్కన, గణపతిదేవుడు ప్రవేశింతురు )

గణపతిదేవుడు

మహామాత్యులకు నమస్కారము.

తిక్కన

జయము జయము కాకతి గణపతి చక్రవర్తికి.

గణపతిదేవుడు

తమ శుభాగమనముచే మా ఏకశిలానగరము పవిత్రమైనది.

శివదేవయ్య

అనుమకొండయు అట్టి అదృష్టమునకు నోచుకొనినదేయయినది.

గణపతిదేవుడు

తమ రాక మమ్ముల కృతార్థుల జేసినది.

తిక్కన

ధర్మమూర్తులకు ప్రభువులకు ముఖ్యపట్టణమై వెలసిన అనుమకొండను దర్శించుభాగ్య మబ్బినది.

శివదేవయ్య

తమ వాదశక్తి విమతస్థులకు వాగ్బంధన మొనర్చినది.

గణపతిదేవుడు

వైదిక సిద్ధాంతములను ప్రతిభతో ప్రతిపాదించుట వలన జైనుల వాదములన్నియు పరాస్తము లయినవి.

శివదేవయ్య

తాము నిన్నటి మహాసభలో అట్లు వాదించుట వలననే అద్వైతు లల్పసంఖ్యాకు లయియున్నను జైనులు విజృంభింప జాలక పోయిరి.

గణపతిదేవుడు

మేము తలపెట్టిన పరపక్షనిర్జయము తమవలన పూర్తి అయినది.

శివదేవయ్య

ఈ నిర్గ్రంథులను అణచుటకు సర్వప్రయత్నములు జరిగినవి.

తిక్కన

కాలమనుకూలించి యుండలేదు కాబోలు.

శివదేవయ్య

జైనులు, కాకతి ప్రోలరాజు కాలమునుండియు విశేష వ్యాప్తి కలిగియుండి, తరువాత నిరంకుశముగ చెలరేగిరి. విశేషించి రాజమహేంద్రవరమునుండి ఇన్నూరు వత్సరముల క్రిందట మా అనుమకొండకు వలసవచ్చి ఋషభతీర్థుడు పెచ్చుపెరిగి జైన ధర్మవ్యాప్తి చేసినాడు.

తిక్కన

తమ ప్రచారమునకు నిరోధములు లేకుండుట వలన జైనులు మితిమీరియుందురు.

గణపతిదేవుడు

నిరోధములమాట యటుండ, మొన్నమొన్నటి వరకు కాకతీయులు జైనమతావలంబకులనియు మా దేవత "కాకతి" జైనదేవత యనియు, కనుక కాకతీయుల పాలనమున ఆమతమే అభివృద్ధి చెందవలెననియు వారి ప్రచారము వృద్ధి కాజొచ్చినది.

శివదేవయ్య

గణపతి చక్రవర్తి పరిపాలనమున కల్పించిన నిరోధములే జైనులకు దుస్సహములైనవి.

తిక్కన

తాము అవలంబించిన నిరోధ విధానము వినవలతును.

గణపతిదేవుడు

తమవంటి పండితులు వానిని విని మాధ్యస్థ్యము వహించి నిర్ణయము తెలుపుట ఆవశ్యకము.

శివదేవయ్య

జైనులలో ననేకులు నిర్గ్రంథులు, మేము గ్రంథప్రామాణ్యము చూపి స్వవచన ప్రామాణికులగు నిర్గ్రంథులను శాస్త్ర వాదమున జయించితిమి.

తిక్కన

తమ పూనిక ప్రశాస్యము.

శివదేవయ్య

తరువాత ప్రతాపరుద్రదేవుని దండనాథుడగు శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల వారియెడ ప్రజలకు భక్తి హెచ్చినది. అనేకులు శివదీక్షాపరులైనారు. విజృంభించుచున్న సనాతన ధర్మమునకు విశేష దోహద మొసంగితిమి.

తిక్కన

అట్లు వైదిక సంస్కృతిని పెంపుచేయు టెంతయు సమంజసము.

శివదేవయ్య

తరువాత గణపతి చక్రవర్తుల అనుజ్ఞతో మాగోప రాజు రామప్రధాని ప్రభృతులు జైనులనుండి గ్రామకరణోద్యోగములను ఆర్వేలవారి కిప్పించిరి. అప్పటికిని వారి విరుద్ధ మతప్రచారమును మానినది లేదు సరికదా రాజకీయ విషయములందును జోక్యము కలిగించుకొన జొచ్చిరి.

తిక్కన

రాజకీయ విషయములలోకూడ వీరి ప్రవేశమా ?

శివదేవయ్య

జైనుల వైఖరుల నన్నిటినిచూచి కాకతీయ ప్రభువులును పరమోత్కృష్టములగు ఆర్షమతమును, ఆర్యధర్మమును, రక్షించుటకు, పోషించుటకు బద్ధకంకణులైరి. తమ విజ్ఞానము భద్రముగా కాపాడుకొనవలసిన బాధ్యతను తెనుగు ప్రజలు గుర్తించిరి

తిక్కన

రాజునకు తోడ్పడుచు ప్రజ మెలగుట యుక్తము. వారు ధర్మమార్గమును తొలగకుండ పట్టుదలతో నుండుటయె వారివిధి.

శివదేవయ్య

జైనులు ప్రజల రెచ్చగొట్టిరి. ప్రభుత్వ మట్టితరి జైనుల శిక్షింపవలసి వచ్చినది. వారును పెచ్చుపెరిగి శత్రుకోటిలోని పాండ్యులతో రహస్యముగ మంతనములు సల్పుచు రాష్ట్రముపై వారిని దండెత్త పురికొల్పిరి.

తిక్కన

అహింసావ్రత పరాయణులమని ప్రగల్భములు పలుకు జైనులు ఇట్టి ఘోరకృత్యములకు ఎట్లు పాల్పడిరి ?

శివదేవయ్య

అప్పుడు కాకతీయ ప్రభువు కొంత కాఠిన్యమును వహించి వారలను వెడల నడపవలసి వచ్చినది.

తిక్కన

కేవలము మతప్రచారకులుగ నుండినచో వారికీపాటులు సంభవించెడివిగావు.

గణపతిదేవుడు

ఔను.

తిక్కన

సభ్యతకు మూలకందమగు మతోద్ధరణము కావలెను గనుక ప్రభువులు కాఠిన్యము వహింపవలసి వచ్చినది.

శివదేవయ్య

ప్రాణాధికమైన ఆర్యధర్మము నుద్ధరించి ప్రభువులు పరంపరాగతమగు ఆచారమును పాటించిరి.

తిక్కన

గణపతి చక్రవర్తులు సంప్రదాయ విధేయులైరి. ఇది ఎంతయు సమీచీనము.

గణపతి

మంత్రిశేఖరా! భారతేతిహాసమున ప్రధానముగ ధర్మ పరాయణులును ధర్మప్రవర్తకులు నగు పూర్వరాజ చరిత్రమే గదా!

తిక్కన

యథార్థము. ఎందరు చక్రవర్తులేలినను హరిశ్చంద్రాది షట్చక్రవర్తుల చరితలనే చెప్పికొనుటకు కారణము వారు ధర్మ వర్తులు ధర్మదర్శులు నగుటయే.

శివదేవయ్య

ధర్మభ్రంశము కాకుండ కాపాడుటకే మనకు "రాజు" ఏర్పడినాడు.

తిక్కన

వైదిక మతవ్యాప్తి కెంతయు ప్రచార మావశ్యకము. ధర్మేతరులు తప్పక తమంత తాము రూపుమాసిపోదురు.

శివదేవయ్య

జైనాది మతము లమగంటవలెనని శుద్ధ దేశీయమైన ద్విపదాది వృత్తములందుగాని సరళమగు వచనములందుగాని రచనలను గావించి మన మతమును ప్రచారము చేయ వలయుననుట నిశ్చయము.

తిక్కన

దేశికులు సెలవిచ్చినది సత్యము. ద్విపద విసుగుగ నుండు ననుకొని దానిని పరిహరించినను జాతీయములైన తెలుగు పలుకులతో వృత్తములు వ్రాయవచ్చును. కావలసినది సుబోధకత్వము. వచన రచనలుకూడ ఈవిషయమున ఉపకరించును. ఉద్యమములను ప్రచారము చేయుటకు ఈ సారస్వతప్రక్రియలే గ్రహింపదగినవి.

శివదేవయ్య

విద్వత్కవులకు చెప్పఁబూనను. అయినను మా శైవ పాండితీ పీఠ మనదగు పాల్కురికి సోమనాథుడు ద్విపద నాశ్రయించియు, జాను దెనుగు నుపయోగించియు మత ప్రచారము నమోఘముగ చేసిఁవాడని మనవి చేయుచున్నాను. ఆతని రచనలు సారస్వత పరిపోషకములు లగుట సంతస ప్రదము.

తిక్కన

శివకవులు ఈ విషయమున మనకు మార్గోపదేశికులు.

శివదేవయ్య

ప్రచారము చేసిన వీరశైవ మాంధ్రదేశమును శౌర్యవంతము చేసినది.

తిక్కన

ధర్మ రక్షకులగు కాకతీయుల ప్రాపున వర్ధిల్లిన శైవము అట్టిదేగదా !

శివదేవయ్య

యథార్థము.

గణపతిదేవుడు

భగవదనుగ్రహము, మహాకవుల వాక్ప్రభావము; అమాత్యశేఖరుల ఆశీర్వాదబలము.

శివదేవయ్య

చక్రవర్తులు నుడివినది తథ్యము. పూర్వ చాళుక్యుల కాలమున కదలాడజొచ్చిన జైన బౌద్ధ మతముల ప్రచారము నరికట్టినది మహాకవి నన్నపార్యుని మహాభారతము.

తిక్కన

ఔను. అది విమతస్థులయెడ జరిపిన ప్రథమ ప్రతిక్రియ. వర్ణాశ్రమాచార రక్షకుడగు రాజరాజు రాజధాని నుండి వారిని నిష్కాసము చేయుట ద్వితీయ ప్రతిక్రియ.

గణపతి దేవుడు

నాడు నన్నపార్యుని ఆంధ్ర మహాభారతము వెలసినది. నేడు తిక్కన కవీశ్వరుల ఆంధ్ర మహాభారతము ...

తిక్కన

ఆంధ్ర కవిత్వ విశారదుల మహాభారతమునకు రాజ రాజు ప్రేరకుడు ...

శివదేవయ్య

తమ భారతమునకు ?

తిక్కన

హరిహరనాథుడు. ఆ సర్వేశ్వరుని ఆదేశముకల కృతి నిర్మాణ ప్రస్తావనమాత్రమే పూర్తియైనది.

గణపతి దేవుడు

కవీంద్రా! తమ భారతావతరణ ఘట్టము నాకర్ణింప కుతూహలులము.

తిక్కన

విజ్ఞులకు విన్నవించుటకంటె మహాభాగ్యమే ముం డును ? అవధరింపుడు.

శ్రీయన గౌరి నాఁ బరగు
చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహ
రంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని
పల్కెడుభక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చ మెచ్చుపర
తత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్.

(అని ప్రార్థనము చేసి తన భారతము నందలి కృతినిర్మాణ ప్రస్తావన అంతయు చదువును.)

శివదేవయ్య

ప్రభూ! మనము ధన్యులము. ఆహా! భారత సంహిత వంటి మహాగ్రంథరచన కుచితమయిన ప్రతిభా పాటవములీ కవిశేఖరునియం దలరారుచున్నవి. వారికిగల ఇతిహాస రచనాధికారము సూచితమైనది. వారి కృతినిర్మాణప్రస్తావనయే ఇందుకు నిదర్శనము.

గణపతిదేవుడు

తిక్కన మనీషి ఋషికల్పులు. వారికి హరిహర ప్రపత్తి మెండు.

శివదేవయ్య

అద్వైతమునుపోలు మా శైవమతము వంటిదే వీరి హరిహరాద్వైతమును, శైవపారమ్యము సూచితమయినట్లే జీవబ్రహ్మల అభేదము నిందు అంగీకృతములు.

గణపతి దేవుడు

కవీశా! తిక్కన గ్రంథ మెప్పటికిపూర్తి కాగలదు?

తిక్కన

తమ తోడ్పాటున మా రాష్ట్రమున శాంతి నెలకొని నప్పుడు.

గణపతి దేవుడు

తప్పక ఇట్టి గ్రంథ రచనోద్యోగమునకు తోడ్పడ గలందుల కెల్లప్పుడును యత్నింతును. శివదేవా! తిక్కన కవీశ్వరులు ఏకశిలానగరమునకు విచ్చేసి జైనుల నణచి తమ కావ్యపఠనమున మనల నానందమున గ్నల గావించినారు. భక్తి చిహ్నముగ రత్నాంబరభూషణములు, అష్టగ్రామములు, నవ లక్ష ధనము, మకరకుండలములు సమర్పించి పూజింతము.

శివదేవయ్య

అవశ్యము.

(రాజుచేత తిక్కనకు బహుమానముల నిప్పించును.)

తిక్కన

కవికులమునకు కాకతి వంశము కల్పవృక్షము గదా! బహుమాన పురస్సరమగు తమ సత్కారమునకు శివస్వరూపులగు విశ్వేశ్వర శివదేశికుల సన్నుతికిని ధన్యుడను.

గణపతి దేవుడు

తమ రాష్ట్రమునందని కల్లోల మెట్టిది? నే చేయగలిగిన దేమి ?

తిక్కన

మా మనుమసిద్ధిని నెల్లూరినుండి పారద్రోలుటకు ఆతని దాయాదులు అక్కన బయ్యనలు ప్రబల ప్రయత్నముల చేయు చున్నారు. తమ సాహాయ్యమె తెనుగు చోడునికి సంరక్ష.

గణపతి దేవుడు

చిత్తము. అచిరమున నేనును మా సేనానాయకుడును బయలుదేరి వచ్చి అక్కన బయ్యనాదుల అంతము గావించెదము. మీ రాజునకు కలిగిన విపత్తును నివారించెదము. జన్నిగ దేవ సేనానిని మన యుద్ధభటులతో సాయత్తము కమ్మని మహామాత్యులు శివదేవు లాజ్ఞాపింతురుగాక. మన వెలమ బసవన్నకు సమరసన్నాహములు సత్వరము కావలెనని ఆన తిండు.

తిక్కన

ఆంధ్ర చక్రవర్తి విక్రమ సాహసౌదార్యములకీ ఆపన్న సంరక్షణ దీక్ష వన్నెవెట్టునది. తేజో ధైర్య ధార్మిక త్వాది గుణంబుల గరిష్ఠుండైన మాధవవర్మ నృపాలునివలె గణపతి చక్రవర్తులు; విప్రోత్తముడును, షట్కర్మనిరతుడును, దయాదాక్షిణ్య శీలుడును నైన మాధవశర్మవలె విశ్వేశ్వర

శివదేశికులును తిరిగి ఈ అనుమకొండ రాష్ట్రమును కుదురు కొనుట ఆంధ్రావళి పుణ్యపరిపాకము సామంతరాజుల సుకృత విశేషము. నాకు సెలవొసంగుడు.

(తిక్కన నిష్క్రమించును)

గణపతిదేవుడు

శివదేవా! తెనుగుచోడుని భద్రతార్థము సంగ్రామమునకు కనకగిరి ప్రాంతములకు దండయాత్ర చేయవలయునని మన పురమున జాటపనుపుడు. రేపే తగు సైన్యములతో తరలెదము.

(గణపతిదేవుడు, శివదేవయ్య నిష్క్రమింతురు.)

(తెరవ్రాలును.)

---

## పంచమ రంగము

( మనుమసిద్ధి సభాభవనము,

మనుమసిద్ధి, తిక్కన ప్రవేశింతురు )

తిక్కన

యుద్ధములను గెలుపు నందితివి. విజయోత్సవముల మహావైభవముగ జరిపించితి. సిద్ధిరాజా ! నీవు ధన్యుడవోయి!

మనుమసిద్ధి

సిద్ధసంకల్పులు, శూరశిఖామణులు సచివులై యుండఁగ సిద్ధిరాజులు కృతార్థులు కాకుందురా ?

తిక్కన

అక్కన బయ్యనలతోడి యుద్ధమున మనకు తోడుగా వచ్చి ఆదుకొనిన ఆంధ్రచక్రవర్తికి మనమెంతయు కృతజ్ఞులము.

మనుమసిద్ధి

ఆయుద్ధమున కాకతి గణపతికిని, కాటమరాజుతోడి యుద్ధమున ఖడ్గతిక్కనకును మనమెంతయు ఋణపడి యున్నాము. ఈసంతోషసమయమున మన సర్వసేనాధ్యక్షులు లేకపోవుట చాల శోభాహీనముగ నున్నది.

తిక్కన

విధి నిర్ణయమును ఎవరు తప్పింపగలరు ?

మనుమసిద్ధి

మన ఖడ్గతిక్కన స్వర్గప్రస్థాన మిప్పుడు ఎంతయు స్మరణీయము.

తిక్కన

ఔను.

మనుమసిద్ధి

మామా! నాడు మన సేనానాయకుడు తిరిగివచ్చి మరల కొన్నివాహినులతో కదనరంగమున కేగుట ఎంతయు వీరోచితము.

తిక్కన

ఔను! నాడు ఆతని పొంగులువారు సమర ప్రతాపమును ఏరును అరికట్టజాలక పోయిరి.

మనుమసిద్ధి

కదనరంగమున కురికి మన తిక్కశౌరి సమరాంగణ భీముడై సంచరించుచుండ శత్రుసేనాధిపతి పిన్నమనాయుడు, ఈమహాబ్రాహ్మణుని జెనక సందేహించెనట. రిపుల కందర

కన్నిరూపులై ప్రచండముగా పోరు మనవీరుని ఆరాధ్యబ్రాహ్మణుడు బ్రహ్మరుద్రయ్య తాకెనట.

తిక్కన

పిన్నమనాయని బ్రాహ్మణ భక్తి శ్లాఘ్యము.

మనుమసిద్ధి

ద్వంద్వయుద్ధమున ఆ యోధు లొకరి నొకరు పొడుచుకొనిరట.

తిక్కన

ఆరాధ్య బ్రాహ్మణుడు మన దండనాథుని తాకి ద్వంద్వయుద్ధ మొనర్చెగా !

మనుమసిద్ధి

మనస్వి యగు మన ఖడ్గతిక్కన నేలగూలి, "నేటితో కదా నాకు ఆపాదింప బడిన కళంకము తీరినద"ని తన సైనికుల హాహాకారములమధ్య ప్రాణముల విడిచెనట.

తిక్కన

మానఘనా ! మహితయశుడ వైతివిగదా! నాడు నిన్ను నిష్ఠురములు పలికి చింతాకులస్వాంతుని గావించినవారు ఇది

గుర్తించి పశ్చాత్తాపమున తమ పాపపంకిలము కడిగివేసి కొందురుగాక!

మనుమసిద్ధి

లోకము అనాలోచితముగా పెద్దలనుగూర్చి భావించుచుండును. ధర్మయుద్ధమునుజేసి అందు తనువును త్యజించిన అపర ద్రోణుడు గదా మన తిక్కన. ఆతడా అపయశస్సునందు వాడు?

తిక్కన

రాజా! తెనుగువారు తమ నాయకుల మహాత్త్వములను తెలిసికొనజాలరు. ఇది తరచుగా జరుగుచుండు విషయమే.

మనుమసిద్ధి

తత్కాలముననుండు పాక్షిక బుద్ధులె ఇందుకు బాధ్యులు. ఎంతటి ఘనులు నిందుకు కట్టుపడవలసియుందురు.

తిక్కన

సవిమర్శక జ్ఞానము, సదసద్వివేకము మన రాష్ట్ర ప్రజలకు కలుగుగాక!

మనుమసిద్ధి

ఖడ్గతిక్కన విగ్రహమును వీర సంస్మరణ మందిరమున నుంచితిమి.

తిక్కన

అది మన ప్రతిమా గృహమున కొక అలంకారము.

మనుమసిద్ధి

కీర్తిశేషులు, ఖడ్గతిక్కన, సిద్ధనామాత్యుల ప్రతాప ప్రతిభలే మా సుస్థితికి కారణభూతములుగదా! కొట్టరువువారి వలె మాకు కూర్చువారు ఉండరు.

తిక్కన

కాటమరాజుతోడి యుద్ధమున కొంత కష్టము మా కుటుంబమునకు కలుగుట కాలకర్మవశమున నయినది. అయ్యది అనుభావ్యమే గదా! భావి కర్తవ్యమును నిర్ణయింపనగును.

మనుమసిద్ధి

మరల ప్రశాంత సమయములు సంభవమైనవి. హరిహరనాథులపేర ప్రారంభించిన మహాభారతము పూర్తి కావలెను.

తిక్కన

కాకతీయ చక్రవర్తిచేతను, తెలుగు చోడరాజుచేతను ప్రేరేపితుడనై నందున ఆ గ్రంథమును పూర్తిచేయుటకే పూనిక గలదు,

మనుమసిద్ధి

యజ్ఞదీక్షను ముందు పూనుటకు నేను గణపతి చక్రవర్తులవలెనే కోరుచున్నాను. తమ అగ్నిష్టోమ మహాయజ్ఞము నిర్వర్తించుట కీమనుసిద్ధి సేవల స్వీకరించి దానిని పూర్తి కావింపుడు.

తిక్కన

ఇర్వురు ధరణీశుల చేతను, ఈశ్వరుని అపరావతారమైన శివదేవులచేతను కీర్తి పాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుని క్రతువు, గ్రంథము, పూర్తియగుటకు హరిహరనాథు డాశీర్వదించుగాక ! నాకు నిత్య కర్మానుష్ఠానమునకు సమయమగుచున్నది.

(తిక్కన నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

---

## షష్ఠ రంగము.

( మనుమసిద్ధి సభామందిరము ·

మారన, కేతన, మనుమసిద్ధి ప్రవేశింతురు )

మారన

గురువుల యాగమును పరిపూర్తి గావింప కనులార గాంచి ధన్యుల మైతిమి.

కేతన

మన ప్రభువు కోరిక నెరవేర్చుకొనినాడు. గణపతి చక్రవర్తి అభ్యర్థనమును సార్థకము గావించినాడు.

మనుమసిద్ధి

మహామంత్రి తిక్కనశకమున నెగడిన మనమందర మును సుకృతులము.

మారన

వారి భారత రచనమును సమాప్తి కావచ్చినది.

మనుమసిద్ధి

ఆ మహాకవి శిష్యులగుట పుణ్యావిశేషము. జన్మజన్మాం తరములకుగాని లభ్యము కానిది.

మారన

మాకు ఆయుగపురుషుల అంతేవాసుల మనిపించు కొనుభాగ్య మబ్బినది. విశేషించి మా కేతనకు వారు భారత మును పూర్తిజేయుచున్న ఈ పవిత్ర సమయమున తన దశ కుమార చరిత్రను కృతినిచ్చు మహాభాగ్యము కలిగినది.

మనుమసిద్ధి

తిక్కన సోమయాజియంతవానికి కృతినిచ్చుటకు కేతన నోచుకొనినాడు.

మారన

కేతన కృతార్థుడు. కవి తిక్కనచే బహూకృతుడైన వాడు. ఇతర కవుల కావ్యముల ప్రశంసించి బిరుదము లిచ్చియు, తాను కవియై పెరకవుల నింత ఆదరించియు ప్రస్తుతి కెక్కినవారు తిక్కనసోమయాజి ఒక్కరే.

మనుమసిద్ధి

మామ అన్నిటను అద్వితీయుడే. మీ గురువుల గుణగణముల పొగడనేర్చెనుగదా మన కేతన! ఆయన విద్యా వివేకముల కొండాడ గలిగెను. మహాకవి జీవిత చరిత్రము నందలి కొన్ని ఘట్టముల పొందుపరచుట అనునది అపూర్వము.

మారన

యథార్థము. గురువుల ఉదయ ప్రశస్తులను స్వరూప స్వభావాదులను స్ఫురింపజేయు సద్గ్రంథము వారివలన సాక్షా ద్ముపదేశములపొంద నోచుకొనిన అతడు కూర్చినది గనుక నింత రసవంతముగను నిర్దుష్టముగను నెగడినది.

మనుమసిద్ధి

మారనా! తిక్కన ప్రభవించిన పుణ్యకాల ప్రస్తావ నమున జనన కాలాదులను పేర్కొన లేదు.

మారన

అంత స్పష్టముగా నుల్లేఖించుట ఐతిహాసికులపని. కవులువ్రాయు జీవిత చరిత్రలు దేశచరిత్రలకు వ్యాఖ్యాన ప్రాయములై అన్యోన్యాశ్రయములుగ నుండునను ఆశయ మున వదలియుండును. గురువులే ఒకపర్యాయము తాము జన్మించిన పవిత్ర వాసరము శాలివాహనశక సంవత్సరములు ౧౦౭౨ ఫాల్గున శుద్ధదశమి అని సెలవిచ్చినట్లు వింటిని.

(కేతన ప్రవేశించును)

మనుమసిద్ధి

కేతనా! నీకృతిప్రశంసయే జరుగుచున్నది.

కేతన

అభినవ భోజుల ఆదరణమునకు; ఆంధ్ర కవివతంసుని వాత్సల్యమునకును సర్వదా కృతజ్ఞుడను.

మనుమసిద్ధి

సోమయాజుల భారతము సమాప్తి కావచ్చినదని మన మారన చెప్పినాడు. చాల సంతోషమైనది.

కేతన

రాజా ! సోమయాజుల కృతి సమస్త జగద్ధితంబుగ వెలయగల సూచనలు గలిగి యున్నదనుటకు సంతసించు చున్నాను.

మనుమసిద్ధి

మామ కృతులన్నియు నట్టివే. నిర్వచనోత్తర రామాయణ మా కాలపు గ్రంథములలో నింతటిది లేదనిపించు కొనినది గదా !

మారన

కొంత భేద మున్నది. అది సహజము. ఉత్తరరామాయణమున గురువులు త్రిమూర్తి భేద మంగీకరించిరి. భారత రచననుబట్టి బహ్మాద్వైతమును గుర్తించినట్లు గాన నగును. వారి యోగసిద్ధియు నీ పంచమ వేదమున పొడగానన గును.

కేతన

కాదామరి! రామాయణము నాటికి మంత్రిత్వమును నిర్వహించు చున్న ఉభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమున పారగులు. నేటికి వారు సమస్త భోగముల ననుభవించి సంసార స్వరూపమును గ్రహించిన విరాగులు కనుక సత్వసిద్ధి సర్వదా ప్రత్యక్షమగునట్లు చేసినారు.

మనుమసిద్ధి

మహానుభావుడు మామ! లౌకికాధికార ధూర్వహుడై యుండిన గ్రంథ రచన పొసగదని వారిని రాజకార్యములనుండి విశ్రాంతి గైకొన కోరినాను.

కేతన

ఆంధ్ర వాఙ్మయమున కమూల్యాలంకారము నొసంగినవారమురి. గురువులు లౌకికాధికార ధూర్వహులుగ నుండి యుండిరి గనుకనే మహాభారతమున రాయబారపు ఘట్టములను, యుద్ధవర్ణనముల నట్లు తీర్చి దిద్దిరి. విసియందును అభ్యంతర సమాలోచనలలో ముఖ్యముగను, ఆ మహాకావ్యమందంతటను నా మహామంత్రి ప్రతిబింబింపని స్థలము లేదనవచ్చును.

మారన

యుద్ధతంత్రము, రాజనీతి, బ్రహ్మ విద్యోపదేశము

సమర్థతతో నిర్వహింపగలుగుట మంత్రి, కవి, యోగియు
నైన గురువులకే చెల్లినది.

మనుమసిద్ధి

మామ అధికారము గలదను ఆశయముతోడ నీవిపుల కావ్యమును ప్రారంభించిరి గదా!

కేతన

గురువులయెడ మూర్తీభవించిన సంపూర్ణ గుణ సనాథత్వమే దీనికి కారణము.

మారన

గురువులు కార్యదక్షులు. అద్వైత సిద్ధాంతములను, బీజముల ప్రజల హృదయము లను క్షేత్రముల నాటగలిగిరి కనుకనే మత వైషమ్య మంతరించినది. తిక్కనయోగీశ్వరులు తమ ఉపదేశముల గ్రంథములందెడనెడ పాత్రల ముఖమున గావించుచు వచ్చిరి. ఆంధ్రులను భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నుల జేయ నివి యెంతయు సమర్థములు గదా! భారత ఆశ్వాసాంత పద్యములు ప్రార్థన కుపకరించుటను ముముక్షువులకు పారాయణ యోగ్యములు.

కేతన

గురువులు నాటకసరణి కనుకూలమైన చిత్త ప్రవృత్తి

గల మేధావులు గనుక ఆవిధముగ రచియించిరి. మానవ స్వభావ వర్ణనలను అట్లుచేయ వారికి అనువైనది.

మారన

ఆంధ్రభాషా మర్మము లన్నిటిని గ్రహించి, అతి గంభీరములైన ఉపనిష ద్రహస్యములను సైతము వ్యక్తము చేయగలశక్తి తెలుగు భాషకు గలదని చాటుటకు గావించిన యత్న మమోఘమైనది.

కేతన

ఇందుకు వారు మన జాతికి సహజమును, నిత్యోప యోగియునగు జీవద్భాషను వినియోగించుట విశేషము.

మారన

పారాశరకృతిని తెలుగుభాషను వినిర్మింప దలపెట్టు టచే కొన్నితావుల తగ్గించుట, కొన్నితావుల విపులీకరించుట, కొన్నితావుల విసర్జించుట మొదలగు మూలాతిక్రమణములు గావించుచున్నారు. కథకు ప్రాధాన్యముతగ్గి, కావ్యతా గుణము లోపించునని గురువులు దీర్ఘములగు వేదాంతవిషయ చర్చలను వదలివేసి యుందురు.

కేతన

అర్థ గౌరవముతోడను యుక్తి బాహుళ్యముతోడను నొప్పునట్టి గ్రంథ మచిరముననే. మనల నానందపరవశుల జేయఁగలదు.

మారన

రచనా చమత్కృతి, కల్పనా కౌశలము గురువులవి అనుకరణములుగా నున్నవి.

కేతన

ప్రజ్ఞానిధులు పూర్వరాజ చరితల నిట్లు రసనమంచిత ముగ రచించుచు గ్రంథ మందంతటను అమృత ధారను ప్రవహింప జేయుచున్నారుగా !

కేతన

ఔను ! మానవ ప్రవృత్తి ఎన్ని ముఖములు కలిగి యుండునో అన్నిటి గభీరతను గ్రహించి, సర్వశిల్పప్రౌఢి, సమస్తశాస్త్ర నిపుణతయు, సర్వవ్యవహార దక్షతయు నలవడి తదనుగుణముగ లోకయాత్ర నెరపుట అను భాగ్యము లభించినది గనుక అనంతర స్థితినంది వ్రాయనెంచుట గురువు లకే కుదిరి యున్నది.

మారన

ఆంధ్రుల పూజా ఫలముగ మహాభారతము గురువు లచే నిర్మితమైనది.

మనుమసిద్ధి

ఈ సంవత్సరము ఫాల్గున శుద్ధ దశమి ఈ ఆంధ్రమహా పురుషుని జయంతి.

మారన

ఔను.

మనుమసిద్ధి

నాటికి కవిబ్రహ్మ మహాభారత రచనయు పూర్తి కావచ్చును.

కేతన

అగుననియె భావింపవచ్చును.

మనుమసిద్ధి

ఆనాఁడు మన దేశమున కంతటికి మహాపర్వదినము. సందేహమేమి పుంభావ సరస్వతులుగదా మా గురుపాదులు!

కేతన

రాజా! కవి పూజను తమ ధర్మముల కెల్ల నుత్తమ ధర్మముగా పరిగణించి పూర్వచాళుక్యులు ప్రసిద్ధినందిరి.

ఆమర్యాదను అన్నివిధముల నిలబెట్టగల ధన్యులు తెలుగు చోడులు.

హూరన

అవతార పురుషులగు తిక్కన సోమయాజుల ఆరాధన మనల నుద్ధరించును.

మనుమసిద్ధి

ఔను. విధిని నిర్వర్తించుటయె మనము విస్మరించితిమి. పూజ్యులయెడ గౌరవ ప్రపత్తుల మనము చూపవలదా ?

కేతన

అవశ్యము. కారణజన్ములు తిక్కకవినాథుల పూజించుకొనుట యన మన భాగ్యమును మనము కొనియాడుకొనుటయె గదా!

మారన

ఆ మహాత్ముని సందేశమును మనము మననము చేసికొని ఆచరింపవలయును.

కేతన

ఆ మహానాయకుడు నాటి రాజకీయ మతసారస్వత సంబంధములైన ఉపద్రవముల నణచి వానినన్నిటిని నొకచక్కి

దెచ్చినాడు. నాయకులు దేశములోని భిన్నమతములను భిన్న పక్షములను సమసింప జేయుదురు.

మారన

ఔను. అదియే దేశాభ్యుదయమునకు మార్గము.

కేతన

ఆశాంతిప్రియుడు జైనాది పరమతముల విజృంభణ నరికట్టుటకు అహింసామార్గము నుపదేశించెను.

మారన

తథ్యము. గురువులు ధర్మాద్వైత మూర్తులు. తాము నడచిన త్రోవనే ఆంధ్రులకు ధర్మమార్గముగ నిర్దేశించినారు. దానిననుసరించిన వారికి సర్వదా శ్రేయమే.

మనుమసిద్ధి

అమాత్యు లుపదేశించియు, ఆచరణలో నుంచియు ఆదర్శ పురుషులై వెలసిరి. ఆ సమన్వయ సిద్ధాంతము, ఆ అహింసా మార్గము మనకు శరణ్యములు. వారి ఆశయ సిద్ధికి ప్రభువులు ప్రజలు పరిశ్రమ చేయవలెను.

కేతన

ఆంధ్ర దేశమునకేగాదు, ఆర్యావర్తమున కంతటికిని తిక్కన మనీషి నిరూపించిన విధానము, సంప్రదాయము తరణోపాయములు.

మనుమసిద్ధి

యథార్థము. అస్మద్దేశీయులు తిక్కనార్యు ననుసరించు టుత్తమోత్తమము. ఏనాయకుడు సమన్వయమార్గము ననుసరించి ఐక్యమును సాధించి భరతవర్షాఖండత్వమునకు ప్రయత్నము చేయడో ఆతడు బుద్ధిమంతుడుగ, దేశభక్తుడుగ పరిగణింప బడడుగదా!

మారన

ఔను. అస్మద్దేశీయులుప్రాజ్ఞసంప్రదాయమునుపాటించి పరిపూర్ణ భద్రతనుపొంది అభీష్టసిద్ధి నందుదురు గాక!

కేతన

తథాస్తు!

సమాప్తము.

---

వెల్‌కం ముద్రాక్షరశాల, గుంటూరు. జె. 40/డి. కాపీలు 500.

# పరిచయము



మిత్రులు మంగళపల్లి ఉపేంద్రశర్మ గారిచే రచింపబడిన "తిక్కన" యను చిన్న నాటకము చదవటానికి ఎంతో ముచ్చటగా నున్నది. ఇది వచన నాటకమే యయినను ప్రథమ రంగములో రామాయణ పారాయణ సందర్భమున తిక్కన తాతయగు మంత్రి భాస్కర విరచితమని ప్రతీతిగాంచిన భాస్కర రామాయణమునుండి సందర్భానుసారముగ కొన్ని పద్యములు తీసి అందందు ఇమడ్చబడినవి. ఏవో పద్యములు స్వతముగ వ్రాయడముకంటె నిది మేలయినపని.

తిక్కన 13 వ శతాబ్దమధ్యమున ప్రసిద్ధికెక్కిన వాడు. ఈ కాలము దక్షిణ హిందూస్థాన చరిత్రములో మత సాంఘిక విప్లవము జరిగిన మహా కాలము. అవైదికములైన బౌద్ధ జైన మతములు నశించగ కాలమునకు తగిన మార్పులతో హిందూ సంఘము పునర్నిర్మాణము చేయబడిన కాలము.

వర్ణాశ్రమ సిద్ధాంతము లాధారముగ నిర్మింపబడిన హిందూ సంఘ నిర్మాణమున ఎన్ని ఇతర సొగసులున్నను మూలచ్ఛేదకములయిన రెండు లోపములు గాన్పించుచున్నవి. సంఘమునకు పునాదియై జనబాహుళ్యముచే నొప్పునట్టి శూద్రులకందు గౌరవస్థానముగాని వారికి తెలిసినట్టి భాషలో మతవాఙ్మయముగాని లేకుండుట మొదటిలోపము. అందుచే సర్వజన సామ్య భావము గలిగి ప్రాకృతభాషలలో మత వాఙ్మయము సృష్టించిన బౌద్ధమత ము శూద్రులనందరిని ఆకర్షించినది. నాస్తికమగుటచే నామతముకూడ నశించినది. క్షత్రియులు అల్పసంఖ్యాకులుగ నుండుట రెండవలోపము. వీరు దేశములో నాంతరంగికముగ శాంతి నెలకొల్పుటకు చాలియుండిరి గాని స్వల్పసంఖ్యా కులగు అలెగ్జాండరు సైన్యముల నెదుర్చగలిగియు తండోపతండములుగ లక్షలాదిగ వచ్చిన మహమ్మదీయుల నెదుర్పలేక పోయిరి. శాత్రవాహనులు కోటలలోనుండి ధైర్యముగ పోరాడిరి గాని సమూహయుద్ధము లన్నిటిలో నోడి

పోయిరి. అందుచే ఉత్తర హిందూస్థానము సంపూర్ణముగ లోబడి తిరిగి తలయెత్త లేదు.

దాక్షిణాత్యులు ఔత్తరాహులకు పట్టిన దుర్గతిని గ్రహించి త్వరలో మేల్కొని అందరికిని తెలిసిన దేశభాషలలో వైదిక వాఙ్మయమును సృష్టించియు, బ్రాహ్మణులు స్వయముగ రాజకీయములలో ప్రవేశించియు మరాట యాదవ, కమ్మ, రెడ్డి, వెలమ, తెలగ, అగ్నికులక్షత్రియమున్నగు క్షత్రియ జాతుల నేర్పరచియు పైతెగలోపముల నివర్తించిరి. అందుచే దక్షిణమున మహమ్మదీయులకు ప్రాబల్యము కలుగలేదు. చాళుక్యులు, కాకతీయులు, విజయనగరమువారు మహమ్మదీయులకు చోటియ్యకపోగా చివరకు మహారాష్ట్రులు విజృంభించి ఉత్తర హిందూస్థానమంతటను హైందవ సామ్రాజ్యమును నెలకొల్పిరి. చరిత్రాత్మకములయిన యీరెండు మార్పులనే శ్రీ ఉపేంద్ర శర్మగారు తమ దీర్ఘచారిత్రక పరిశోధనలవల్ల గ్రహించి ఈ నాటకమున మిక్కిలి సమర్థతతో చిత్రించిరి.

ఈ నాటకములో కథానాయకుడైన తిక్కన యొక్క కుటుంబము పైజెప్పిన రెండు మార్పులను ఆంధ్రజాతిలో ప్రవేశపెట్టి నవ్యాంధ్రజాతిని నిర్మించుటకు మిక్కిలి తోడ్పడినది. ఘంటము ఖడ్గమునుగూడ చేబూని తిమకక్షము లేనట్లుగ వర్తించినారు. తిక్కన తాతయగు మంత్రి భాస్కరుడు మహాకవియగుటయే గాక గుంటూరునకు ప్రభువైనట్లు తిక్కన రచించిన ఉత్తర రామాయణములో "సారకవితాభిరాము గుంటూరి విభున్ - మంత్రి భాస్కరు మత్పితామహుని దలచి" యని వ్రాసియున్నాడు. వేదములకు తరువాత వేదముల యంతవి యని చెప్పనొప్పిన రామాయణ మహాభారతములు తిక్కన కుటుంబములో బుట్టినవి. ఇంతేకాక ఆ కాలమున శిష్యులు బంధువులు పోషకులు అనేకులు తెలుగు వాఙ్మయమును సృష్టించారు. తిక్కన తండ్రియైన కొమ్మనామాత్యుడు వేదవేదాంగముల జదివి గుంటూరు మండలమునకు దండనాథుడుగ నున్నాడు. తిక్కన పెదతండ్రియగు సిద్ధన నెల్లూరి చోడరాజులకు ప్రధానమంత్రిగను సేనాపతిగను నున్నాడు. ఈ సిద్ధన కుమారుడు ఖడ్గతిక్కన నెల్లూరి రాజులకడ సేనాపతి. అతని తమ్ముడగు దోహత్త నారాయణ మహావీరుడు. తిక్కన నెల్లూరి మనుమసిద్ధికి

ప్రధానమంత్రి. ఈ విధముగ తిక్కన కుటుంబము కీర్తిప్రతాపముల రెంటిని విజృంభింపజేసినది.

పైజెప్పబడిన విషయముల నన్నింటిని శ్రీశర్మగారు తమ నాటకమున నిమిడ్చి ప్రదర్శించినారు. సన్నివేశములు చక్కగా కల్పింపబడినవి. తిక్కన మహాకవి, జీవితము తత్సందేశము అప్పటికి ఇప్పటికిని ఆదర్శప్రాయముగను చూపినారు. నాటకము ప్రేక్షకులను రంజింపజేయునదనీ ప్రదర్శింపబడుటకు కను వైనదనీ నాయభిప్రాయము.

కవి జీవితమును వస్తువుగా గ్రహించి ఆంధ్రమున రచింపబడిన నాటకములు అనేకములు లేవు. వచనమున వెలసినవి అసలు లేవేమో? శ్రీశర్మగారు తెనుగులో వచన రచన లెక్కుడుగా విలసిల్లవలెననేవారు.

శాసన కాలమునుండి నేటివరకు వచ్చిన మన వచన వాఙ్మయమును గూర్చి ఆంధ్ర, ఆంగ్ల, మాసపత్రికలలో వ్యాసములు వ్రాసియు, అఖిల భారత వైజ్ఞానిక మహాసభలలోను ఆంధ్రేతిహాసిక, సారస్వతసభలలోను తమరచనలను వెలువరచియు పాటుపడుచున్నారు. ఆంధ్రులకు సమర్పింప నున్న "ఆంధ్రవచన వాఙ్మయ చరిత్రము" అను గ్రంథము మనభాషయందలి వీరి పరిశోధనాఫలితము.

ఆంధ్రభాషాచరిత్రల పరిశోధనలయందు వీరు మిక్కిలి అభిరుచి గలవారు. ఈ క్షేత్రముల వీరింకను కృషిసల్పి ఆంధ్రుల ప్రాచీన వైభవాదులను లోకమునకు వెల్లడించగలరని నావిశ్వాసము. భాషా సారస్వత చారిత్రక రంగములలో పరిశ్రమజేయుచున్నవా రాంధ్రులలో తక్కువ. వీరి ప్రయత్నములను సఫలపరచుటకు ఆంధ్రులు తోడ్పడుదురని నాఆశయము. వీరు తమ సంశోధనమున కృతకృత్యులై దేశమునకును తమకును పేరు ప్రఖ్యాతులు సమకూర్చగలరని ఆశించుచున్నాను.

వున్నవ లక్ష్మీనారాయణ.

# ప్రస్తావనము

"విక్రమపురివాస్తవ్యులతో వియ్యమందుట భావిశుభ
సూచక"మని కొమ్మనచేతను (20), 'విక్రమసింహపురకోట' వీర
రక్తముకాగిపొంగులువారుచున్న' దని 'ఖడ్గతిక్కన' చేతను
(43), బలికించి నెల్లూరివారిగుణగణములఁ గృతికర్త తన
గ్రంథమున నుగ్గడించియున్నాఁడు. ఆవాసనచేతనే కాఁబోలు
గుంటూరులోఁ బుట్టినయీరచనకు నెల్లూరివాఁడనైన నాచేతఁ
బరిచయవాక్యములు వ్రాయింపవలయునను తలంపు గ్రంథనిర్మా
తకుం గలుగుట. ఎందువలన నైననేమి శ్రీ ఉపేంద్రశర్మగారు
నాయెడ నెఱపిన నెయ్యమునకును, నెలకొల్పిన విశ్వాసమున
కును నేను కృతజ్ఞుడను.

2. ఇందలి చరిత్రాంశము లెంతవఱకు సత్యములో నే
నెఱుంగను. ఇందు, పరిశోధనపారంగులైన శర్మగారివాక్కులే
నాకుఁ బ్రమాణము. కవి విషయమునఁ జరిత్రచర్చలన్న నాకుఁ
దలనొప్పి. అందువలననే, యొకప్పుడు పోతరాజునివాసస్థలమును
గూర్చి కీర్తిశేషులగు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారును
(ఆంధ్రవాల్మీకి), శ్రీ జయంతి రామయ్యపంతులుగారును (కళా
ప్రపూర్ణులు), వివదించుకొని యశోజ్ఞాశయముల నాకాంక్షించి
నపుడు, 'కవిప్రశంసా' వ్యాజమున

చ॥ నవుఁడవొ గాక పూర్వుఁడవొ నట్టిది మెట్టయొ కాక మిట్టయో
తివిరి చరిత్రశోధకులతిప్ప లివన్నియు నేల మాకు, నీ
ప్రవిమల కావ్యసర్గ మపవర్గసుఖప్రద మంతె చాలుఁ ద
త్ప్రవణుల కాప్తకాములకు వ్యర్థవిచారశతంబు లేటికిన్॥

అని నాయుల్లము తెల్లము చేసితిని. ఇట్లొకని కవుల దేశకాల విషయమున నాచిత్తవృత్తి యట్టిది. మహాపురుషుల జన్మస్థలములు యాదృచ్ఛికఘటనములు. వారెచ్చటివారైనను, ప్రద్యోతనుని వెలుఁగువలె వారి ప్రభావము విశ్వవ్యాప్తము. కాని యొక్కొక్కప్పుడు మనకుఁ దెలియకయే యభిజనాభిమాన ముప్పతిల్లుచుండును.

చ॥ హరిహరనాథదివ్యచరణాశ్రితుఁ డంచిత వైదికాధ్వత
త్పరుఁడు కృతాధ్వరుం డుభయవాక్పవిమిత్త్రుఁడు తిక్కయజ్వ త్వ
త్పరిసరమందె యాత్మకృతి వ్రాసి కృతార్థతఁ గాంచెనండ్రు; నీ
స్థిరతరభాగ్య మేమని వచింపఁగ! సింహపురీ! పురంబులన్.

(తిక్కన స్మృతి - మదీయము - 1917)

ఐనను, దేశకాలకులజాతినిరపేక్షముగానే కవుల విలువఁగట్టఁ గలుగుట వివేకము. దేశకాలాతివర్తులగు విశ్వజనీనభావములే కదా కవుల యజరామరత్వములనిర్ణయించునవి.

౩. ఈ గ్రంథమున పదమూఁడవశతాబ్దినాఁటి యాంధ్ర నాగరికత చక్కఁగా ప్రతిబింబిత మగుచున్నది. దీనిని తిక్కన జీవితచరిత్రగాఁ దానే చెప్పక గ్రంథకర్త సర్వము పాత్రముఖమున వెలార్చినందున, తిక్కన మహామానుభావములు మఱింత ప్రస్ఫుటము లగుచున్నవి. కథాపురుషుల గుణశీలములు

వ్యక్తముసేయుచోట, సాధారణముగా పాటింపఁబడుమార్గ ములు నాల్గు:

(1) కవయిత స్వయము పాత్రముంగూర్చి చెప్పుట.

(2) తత్తత్సందర్భములయందుఁ బాత్రముయొక్క ప్రవర్తనము.

(3) పాత్రముయొక్క స్వగతములు, లేఖలు మొద లగునవి.

(4) పాత్రముంగూర్చి యితరపాత్రముల ప్రశంసలు.

ఈగ్రంథ మంతయు సంభాషణాక్రమమున సంభావితమైయున్నం దున, ఇందుఁ దొలిదాని కవకాశము లేకపోయినది. తక్కిన మూఁడును శర్మగారిచే ఔచితీపూర్వముగా నిర్వహింపఁబడి యున్నవి. ఆఱవదితక్క తక్కినరంగము లన్నియు ఆసన్న నాయకములు. షష్ఠములో నాయకుఁడు లేకున్నను, అది తచ్ఛాత్రపుత్త్రిలును, ధరిత్రీశుఁడును ఆయనను గూర్చి సేయు సంస్తవములతో నిండియున్నది. ఇట్టివస్త్వైక్యము విమర్శ చతురులైన శర్మగారు సాధింపఁగలుగుట వింతగాదు. తొలి రంగములో మహాకవి నిర్వచనోత్తరరామాయణము రచింపఁ బ్రేరితుఁ డగుటకుఁ గారణములు, రెండవదాన తన్నిర్వాహము, మూఁడునాల్గురంగములలో తిక్కనరాయబారము, తత్ఫలసిద్ధి, యేనవదానిలో 'రాయబార' నిమిత్తకమైన క్రతుదీక్ష, భారత రచనాదులు, యథార్థముగ గ్రువ్వఁబడియున్నవి. ఆయాసందర్భ ములఁ బురస్కరించుకొని, నాటిమత, సారస్వత, రాజకీయ

పరిస్థితులు, గ్రంథోత్పత్తికారణములు, గ్రంథకర్త కల్పించుకొన్న నియమములు, చేకూర్చదలఁచుకొన్న ప్రయోజనములు, శర్మగారు నిపుణముగాఁ దీపించియున్నారు. ఎల్లెడల, తిక్కన కావ్యశిల్పపారగత, కళావిత్త్వము పరిపోషింపబడియున్నవి. తిక్కన వైదికలౌకికకార్యకలాప నిష్ణాతతయుఁ బ్రతిపాదితమైయున్నది. వేయేల? ఈపొత్తము తిక్కనప్రభావసర్వస్వ మనిచెప్పినను చెప్పవచ్చును.

4. విక్రమసింహపురమువారు సుమారు నల్వదేండ్లనాఁడు తొడఁగి నాఁటఁగోలె, తిక్కనజయంతి యవిచ్ఛిన్నముగా సకల విద్వజ్జనప్రియముగా ననువత్సరము జరుపుచున్నారు. ఉపేంద్ర శర్మగారు హిందూకలాశాలలో అధ్యాపకపదవి నధిష్ఠించిన పిదప, కొన్నియేండ్లనుండియు తిక్కనజన్మదినోత్సవము జయావహముగా నడపుచున్నారు. వారు ఒండు రెండుపర్యాయములు ఆయుత్సవములయం దధ్యక్షింపను (ఒండె) ఉపన్యసింపను నన్నుం గోరిరి కాని, అనారోగ్యాదిభయముచేఁ బయనింప నోల్లక నేను వారికోర్కి దీర్పనేరక పోయితిని. మొన్న డిసెంబరు తే 13, 14 దులందు గుంటూరులోఁ గూడిన 'ప్రాచ్య సారస్వత విజ్ఞాన' పరిషత్సంచమ వార్షికోత్సవమునకు నేను అధ్యక్షుఁడనుగాఁ బోయినసమయమున, శర్మగారు తమనాటికను సాంతముగా నాకు వినిచి తొలిపలుకు వ్రాయుఁడని నన్నడిగిరి. పూర్వోక్తజయంతులలో పాల్గొనక పోయినను, ఈచందముననేని వారి చిరాభీష్టము నెఱవేర్తుఁగాకయని యీ రెండుమాటలఁ బ్రస్తావనముఖమున నార్జవముతో వ్రాయు

చున్నాను. 'నాటికా'శబ్దమునకు ఆలంకారికులు కల్పించుకొన్న యర్థమునకు ఈచిఱుకబ్బము లక్ష్యముకాకపోవచ్చును గాని ఇది, విద్యావీరుఁడైన తిక్కన వివిధావదానముల నావిష్కరించు విజయపతాకగా విలసిల్లఁగలదని నానిశ్చయము. శర్మగారు వయస్సునఁ జిన్నవారయ్యు వైదుష్యవిశేషముచేతఁ బెద్ద వారే. ఆంధ్రదేశవిద్వత్పత్త్రిక లెన్నింటికో వ్యాసములు వ్రాయుటే గాక, హైదరాబాదు, కాశీ, నాగపూరు ప్రభృతి పట్టణములలో జరిగిన 'అఖిలభారతప్రాచీనవిద్యాపరిషత్తులలో' నుపన్యసించియున్నారు. నాగపూరులో మొన్న గూడిన పరిషత్తు వీరిని కార్యనిర్వాహకసభ్యులలో నొకరిగా నెన్నుకొని యున్నది. శ్రీశర్మగారు 'ఆంధ్రవచనరచన'ను గూర్చి ప్రత్యేకపరిశోధనలు సాగించియున్నారనివినికి. ఆఫలితాంశము అచిరకాలమున వెలువడి తెలుఁగువారికి ఉపాదేయమునుఁ గావుతమని యాశంసించుచున్నాను.

నెల్లూరు.<br>1—2—1948.

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.

# పీఠిక



మహాపురుషులను స్మరించుచుండుట నాగరకమానవు లకు సహజము. లోకోత్తరకార్యము లేవి చేసినను స్తుతిపాత్రము లగును. సామాన్యముగ మతమున గాని, రాజకీయరంగమున గాని, ఉత్తమకృషి సలిపినవారు లోకదృష్టి నాకర్షించుచుం దురు. తాత్కాలికశ్రేయమునకే తగుకృషి చేసి విరమించుట కన్న సుస్థిరశ్రేయోదాయకకార్యము లొనర్చినచో శాశ్వత కృతజ్ఞతకు కారణ భూత మగును. Positivists అర్థించు గవ్యయుకూడ నిట్టిదే. బహుసంఖ్యాకులు బహుకాలము బహు విధముల ప్రమోదముతో తమ్ముస్మరింపవలె నని వారియాశ యము. లోకోత్తరకార్యకర్తల కీర్తిభావ మున్నను లేకున్నను జనము మాత్రము వారిని సంస్మరించుచునే యుండును. ప్రాతః స్మరణీయు డగుతిక్కన అట్టివాడు.

మతరాజకీయశాఖలలో పురుషార్థము సాధించుటయే గాక సారస్వతశాఖలో నూతనాలంకారము సమకూర్చిన మహా శిల్పి తిక్కన. ఆమనీషి ఏకార్య మొనరించినను జగత్కల్యా ణమున కుపయోగించినది. అమాత్యుడై రాష్ట్రపరిపాలనము చేయుటయే కాక వైరులవలన ఉపప్లవము కలిగినపుడు మహా మహిమాన్వితు డగు కాకతీయచక్రవర్తిని కవనమునను పండిత నిర్ణయమునను మెప్పించి తత్సాహాయ్యమున నిజప్రభువుకు

నిల్చికొన్నాడు. లౌకికవృత్తియే ప్రధానముగా భావింపక పర మార్థచింతతో వైదికధర్మ నిష్ఠాగరిష్ఠుడై దేవసంప్రీతికరమగు యజ్ఞము చేసినాడు. పురోడాశ పవిత్రితవాక్కున సంస్కృత మహాభారతసంహిత "ఆంధ్రావళి మోదముం బొరయ" తెను గున ననువదించినాడు. విమలీకృతవిశదరసనతో చెప్పిన దగు టచే తత్కృతి శాశ్వతపవిత్రకోశమై అలరారుచున్నది.

సుకృతవిశేషమున గాని పురుషుడు ఉన్నతోత్తమా న్వయమున జన్మింప డని సంప్రదాయవేత్తల యభిప్రాయము. తిక్కన పితృపితామహు లసామాన్యులు. తండ్రి కొమ్మన దండనాథుడు గొంటూరిదుర్గాధ్యక్షుడు. తాత భాస్కరుడు రామాయణము ననువదించినవాడు. రామాయణభారతమహా వీరులు అప్రత్యక్షముగా వారిఇంట తాండవించినారు. చిన్న నాడే తిక్కన హృదయమున లౌకికవైదికబీజములు నాటుకొని నవి. అవిక్రమపరిణామము జెందుటచే తిక్కనమనీషి కవి, అమాత్యుడు, సోమయాజి, మహాకోశకర్తయునై వెలసినాడు. తెనుగునాట తిక్కనను పూజింపనివారు లేరు.

ఈకవిబ్రహ్మయెడల తమభక్తిని పలువురు పలువిధముల వివరించినారు. శ్రీ మండలపర్తి ఉపేంద్ర శర్మ గారు తమ భక్తిని నాటికారూపమున ప్రదర్శించినారు. ఉపన్యాసము లెన్ని చేసినను గాలికి పోవుచుండును. మహాపురుషపాత్రను వివిధస్థితి గతులలో రంగస్థలముపై జూపినయెడల నేత్రోత్సవ మగును. ఈవిధానము వలన ఝటితి స్ఫూర్తి కలిగి హృదయము ద్రవీ భూతమై రససిద్ధి యగును.

శర్మ గారు సరళవచనములో నాటికను నడపినారు. ఆయాసందర్భములనుబట్టి రీతి ప్రౌఢిమను దాల్చినది. సంభాషణలలో తత్తదుచితస్థానములయందు కావ్యరాజనీతి ధర్మాది విషయచర్చ జరిగినది. తిక్కన జీవితములో ఐతిహాసికులకు నేటివరకు తెలిసిన ముఖ్యఘట్టములను ఈనాటికాకర్త పొందుపరచినారు.

గుంటూరు నగరమున తిక్కనజయంతి నాడు నాటికా ప్రదర్శనముజరిగినది. ప్రదర్శనమువలన తిక్కనజీవితములోని ముఖ్యాంశములు ప్రేక్షకులమానసమున హత్తుకొనును.

ఇట్టినాటికలవలన ప్రాచీనవైభవము శృంగగ్రాహిక న్యాయమున ప్రత్యక్షమై ప్రజానీకమునకు ప్రబోధప్రమోదములు సిద్ధింపగలవు.

సాహితీ సమితి, గుంటూరు.
జనవరి 1948

శివ శంకర శాస్త్రి.

# సవరణ పట్టిక

| పుట | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|
| 7 | తాతపాదులు | ... | తాతగారు |
| 17 | సూపము | ... | సంతాపము |
| 26 | బ్రహ్మాయె | ... | బ్రాహ్మణి |
| 29 | ప్రశాస్యము | ... | ప్రశస్యము |
| 40 | తృటి | ... | త్రుటి |
| 42 | రాజునను | ... | రాజున కో[illegible] |
| ,, | వివేలగు | ... | వివేకులగు |
| ,, | సర్వస్వమ్ముల | ... | సర్వస్వము |
| 46 | ఆరంభించినవి | ... | ఆరంభిస్తినవి |
| 48 | అహోనిశలు | ... | అహర్నిశములు |
| 50 | నిర్గ్రంధలను | ... | నిర్గ్రంథులను |
| 56 | సంతసప్రదము | ... | సంతోషప్రదము |
| 66 | పాపపంకిలము | ... | పాపపంకము |
| 67 | ప్రేరేపితుడవై | ... | ప్రేరితుడవై |
| 68 | అగ్నిష్టోమము | ... | అగ్నిష్టోమము |
| 79 | సమసింప | ... | సమసింప |

కొన్నిచోట్ల ద, ధ లు తారుమారైనవి. మరి కొన్ని స్ఖాలిత్యములును ముద్రణమున నిలిచిపోయినవి. వానిని పాఠకులు సవరించుకొన గలరు.

## ఉపేంద్రశర్మ రచనలు

| | | |
|---|---|---|
| ఆచార్య జీవితములు | | 1—0—0 |
| ఆంధ్రులు - వివిధోద్యమములు | | 1—0—0 |
| వ్యాసములు - ఉపన్యాసములు | | 1—8—0 |
| (సారస్వత చారిత్రకాదికములు) | | |
| మాధవవర్మ - వచననాటిక | | 0—12—0 |
| తిక్కన | ,, | 1—0—0 |
| కృతజ్ఞత | ,, | 0—12—0 |
| ఉత్తీర్ణత | ,, | 0—12—0 |
| వయోజనవిద్య | ,, | 0—12—0 |
| (గ్రంథాలయములకుచితము) | | |
| Some papers submitted to the All India cultural Conferences (In English) | | 3—0—0 |
| Guide to Telugu General composition (in print) | | 1—0—0 |

ప్రాప్తిస్థానములు :

ప్రాచ్యసారస్వత విజ్ఞాన పరిషత్తు, గుంటూరు.
ఆంధ్ర సేవాసమితి, పెదనిండ్రకొలను, పశ్చిమగోదావరి.